





తెలుగు పద్యకవితా బ్రహ్మోత్సవములు-2017

# శ్రీకాకుళ పద్యభారతి






ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి

ప్రచురణ




తెలుగు పద్యకవితా బ్రహ్మోత్సవములు-2017 శ్రీకాకుళ పద్యభారతి

# తెలుగు పద్యకవితా బ్రహ్మోత్సవములు

# శ్రీకాకుళ పద్యభారతి

సంపాదకులు

డా॥ దీర్ఘాసి విజయభాస్కర్
డా॥ పాలపర్తి శ్యామలానందప్రసాద్
డా॥ జి.వి. పూర్ణచందు



ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి
దుర్గాపురం, విజయవాడ



# తెలుగు పద్యకవితా బ్రహ్మోత్సవములు

# శ్రీకాకుళ పద్యభారతి

2017 ఫిబ్రవరి 18, 19 తేదీలలో కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో జరిగిన శ్రీకృష్ణ దేవరాయ మహోత్సవాలలో భాగంగా జరిగిన "పద్యకవితాబ్రహ్మోత్సవాలు'లో పద్యకవులు గానం చేసిన కొన్ని పద్యకవితలు.


మొదటి ముద్రణ : 2018

వెల : రూ. 100/-



*సంపాదకులు*

డా॥ దీర్ఘాసి విజయభాస్కర్

డా॥ పాలపర్తి శ్యామలానందప్రసాద్

డా॥ జి.వి. పూర్ణచందు



*ప్రచురణ*

ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి

ఘంటసాల వెంకటేశ్వరరావు ప్రభుత్వ సంగీత కళాశాల

దుర్గాపురం, విజయవాడ - 520 003

*ముద్రణ*

శ్రీశ్రీ ప్రింటర్స్, విజయవాడ

94906 34849





ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

**గౌ॥ శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారు**

# సందేశం

శ్రీకృష్ణ దేవరాయ మహోత్సవాలలో భాగంగా 2017 ఫిబ్రవరి 18-19 తేదీలలో జరిగిన పద్యకవితా బ్రహ్మోత్సవాలలో నవ్యాంధ్ర ప్రదేశ్‌కు చెందిన ప్రముఖ పద్య కవులు ఉత్సాహంగా పాల్గొనటం నాకెంతో సంతోషంగా ఉంది. కవుల హృదయాలలోంచి ఉప్పొంగిన భావాలు సామాన్య మానవుణ్ణి విశేషంగా ప్రభావితం చేస్తాయి.

మూడు వందల మంది కవులు పాల్గొని నవ్యాంధ్రప్రగతిని తెలుగు భాష ఘనతని, కృష్ణరాయల కీర్తిని ప్రశంసిస్తూ కవితాగానం చేశారు.

ఈ పద్యకవితా మహోత్సవం కార్యక్రమాన్ని విజయవంతం చేసిన ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి వారిని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. కేవలం కార్యక్రమం నిర్వహించి వదిలేయకుండా ఈ విధంగా ఒక పుస్తకరూపంలో తీసుకురావటం సంతోషించవలసిన విషయం.

తెలుగుభాషా సాంస్కృతుల అభివృద్ధి విషయంలో ప్రభుత్వ నిబద్ధతకు ఈ కార్యక్రమాలు నిలువుటద్దం పడ్తున్నాయి. అందరికీ నా అభినందనలు తెలియజేస్తున్నాను.

**- నారా చంద్రబాబు నాయుడు**

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

అమరావతి








**గౌ॥ శ్రీమతి భూమా అఖిలప్రియ**
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పర్యాటక,
భాషా సాంస్కృతిక శాఖామాత్యులు

# సందేశం

కృష్ణదేవరాయ మహోత్సవాలను పుష్కరకాలంగా ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ పక్షాన జరగటం ఒక విశేషం. 2017 ఫిబ్రవరి 18, 19 తేదీలలో ఈ మహోత్సవాన్ని సాంస్కృతిక శాఖ పక్షాన తెలుగు పద్యకవితా బ్రహ్మోత్సవాలుగా నిర్వహించి పెద్ద సంఖ్యలో ప్రసిద్ధ కవులను ఆహ్వానించటం బహుఆనందదాయకం. తెలుగు భాషాభివృద్ధికి కంకణధారులు కావాలనే ప్రభుత్వ నిర్ణయానికి అనుగుణంగా ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి సత్వరమే నవ్యాంధ్రలోని కవులను ఆహ్వానించి ఈ విధంగా పద్య కవితకు పెద్దపీట వేయటం జరిగింది. తెలుగు భాష కోసం ఇలాంటి కార్యక్రమాలు ప్రతి జిల్లాలోను జరిపించవలసిన అవసరం ఉంది.

కవులందరి మనోగతాలు ఈ కవితలలో ప్రతిబింబిస్తున్నాయి. ఈ కవితలన్నింటినీ ఒక పుస్తకరూపంలో వెలువరించటం ద్వారా ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి గొప్ప సాహిత్య సేవకు పూనుకుందని భావిస్తున్నాను. ఆనాటి పద్యకవితా బ్రహ్మోత్సవాలు ఈ పుస్తకం ద్వారా చిరస్మరణీయం అయ్యాయని భావిస్తున్నాను.

సహకరించిన సంబంధిత అధికారులకు, కవులకు కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాను. అందరికీ శుభాకాంక్షలు.

**– గౌ॥ శ్రీమతి భూమా అఖిలప్రియ**
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పర్యాటక,
భాషా సాంస్కృతిక శాఖామాత్యులు









**గౌ॥ శ్రీ ముఖేష్ కుమార్ మీనా** ఐఏఎస్
కార్యదర్శి,
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పర్యాటక,
భాషా సాంస్కృతిక శాఖ

# సందేశం

గత 12 సంవత్సరాలుగా కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో ప్రతి ఏడాదీ క్రమం తప్పకుండా శ్రీకృష్ణదేవరాయల మహోత్సవాలను నిర్వహిస్తుండటం, ఇందుకు భాషా సాంస్కృతిక శాఖ, దేవదాయ ధర్మదాయ శాఖ, దివి సాహితీ సమితి సంయుక్త ఆధ్వర్యం వహించడం ముదావహం.

2017 ఫిబ్రవరి 18, 19 తేదీలలో జరిగిన శ్రీకృష్ణదేవరాయ మహోత్సవాలను "పద్యకవితా బ్రహ్మోత్సవాలు" పేరుతో నిర్వహించటం, రాష్ట్రంలోని ప్రసిద్ధ కవులు 300 మందిని ఆహ్వానించి పద్యకవితా గానం చేయించటం చాలా ఆనందించదగిన విషయాలు.
ఆనాటి కవులు చెప్పిన పద్యాలన్నింటిని ఒక పుస్తకంగా వెలువరిస్తున్నందుకు నాకెంతో ఆనందంగా ఉంది.

ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సాంస్కృతిక సమితి ఈ పుస్తకాన్ని వెలువరించటం భాషాభివృద్ధిలో ప్రభుత్వానికి గల నిబద్ధతకు సాక్షిగా నిలిచింది.

ఇందుకు కారకులైన ప్రతి ఒక్కరినీ అభినందిస్తున్నాను.

– **గౌ॥ శ్రీ ముఖేష్ కుమార్ మీనా** ఐఏఎస్
కార్యదర్శి,
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పర్యాటక,
భాషా సాంస్కృతిక శాఖ

# పద్యకవితకు వందనం

డా॥ మండలి బుద్ధప్రసాద్
*ఉపసభాపతి, ఆం.ప్ర. శాసనసభ*

'పద్యమ్మె తెలుగు ప్రాణము
పద్యమ్మె తీర్చిదిద్దు వ్యక్తిత్వమ్మున్
పద్యమె సారథి సచివుడు
పద్యము బ్రహ్మోత్సవముల వర్ధిల్లు నికన్'

వేల సంవత్సరాల చరిత్ర కలిగిన తెలుగుభాషకు ప్రాణం పద్యకవిత్వం. వేమన, సుమతి, భాస్కర, దాశరథి వంటి శతకాలు భారతభాగవత రామాయణాలు తెలుగువారి జీవనవిధానంలో, వ్యక్తిత్వవికాసంలో ఎంతో ప్రభావాన్ని చూపించాయి. గణితశాస్త్రం వంటి శాస్త్ర గ్రంథాలు కూడా తెలుగువారు పద్యరూపంలో చదువుకున్నారు. నిఘంటువులు, వ్యాకరణం, ఛందస్సు, అలంకారశాస్త్రం మొదలైనవన్నీ పద్యరూపంలోనే ఉన్నాయి. నిరక్షరాస్యులైన కర్షకులు, చేతివృత్తుల వారు, గ్రామీణులు, స్త్రీలు కొన్ని వందల పద్యాలను గుర్తుంచుకునేవారు. తెలుగుపద్య ఛందస్సు, యతిప్రాసలు, పద్యం కలకాలం గుర్తుండే విధంగా బుర్రలోనాటుకుంటాయి. వాటికి లిపితో కూడా పనిలేదు. వినికిడితోనే జీవితాంతం గుర్తుపెట్టుకోవచ్చు. గురువుదగ్గర శాస్త్రీయంగా చదువుకోకుండానే పద్యరచన చేసినవారున్నారు. పద్యపఠనంలో అంత శక్తి ఉంది. ఇప్పటికీ గ్రామగ్రామాన దేశవిదేశాల్లో పద్యరచన చేస్తున్నవారున్నారు.

అయితే నేటి విద్యావిధానంలో పద్యానికి ప్రాధాన్యం తగ్గిపోతుంది. శాస్త్రసాంకేతిక విద్యాబోధనపేరిట బాలబాలికలకు పసితనంలోనే పద్యాన్ని దూరం చేస్తున్నాం. వారిక చదివే సమయం దొరకటంలేదు. బాల్యంలో చదివినవే

కలకాలం గుర్తుంటాయి. పద్యంతో తెలుగుభాష, సంస్కృతి రాబోయే తరాలలో బలంగా నిలబడతాయి.

పద్యవిద్యావైభవాన్ని, ప్రాభవాన్ని, ప్రభావాన్ని చాటిచెప్పేవిధంగా తెలుగుసాహిత్యచరిత్రలో అపూర్వంగా పద్యకవితాబ్రహ్మోత్సవాల పేరిట జరపాలని ఆంధ్రప్రదేశ్ భాషాసాంస్కృతిక శాఖవారు సంకల్పించటం ముదావహం. వాటికి వేదికగా ఆంధ్రులతొలిరాజధాని, 'బాసదేవర' ఆంధ్రమహావిష్ణువు సన్నిధి, శ్రీకాకుళంలో జరపటం సముచితం. అది 'దివిసీమ'లో ఉండటం, నేను ప్రాతినిధ్యం వహిస్తున్న నియోజకవర్గం కావటం, దివిసీమ సాంస్కృతిక సమితి వంటి స్థానిక సంస్థలు, సంఘాలు, ప్రజలు పాలుపంచుకోవటం నన్ను ఆనందంతో పులకరింపచేస్తున్నాయి. దేవతలకు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. ఆస్థాయిలో పద్యకవితకు బ్రహ్మోత్సవాలు జరపటం అభినందనీయం.

యుగయుగాలుగా తెలుగుభాషకు, పద్యకవితకు పట్టంకట్టిన పుణ్యక్షేత్రం శ్రీకాకుళం. అధర్వణాచార్యులు రచించిన త్రిలింగశబ్దానుశాసనంలో శ్రీకాకుళాంధ్ర విష్ణువును బ్రహ్మాండపురాణ శ్లోకాలతో కీర్తించాడు. శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్యం 'వల్లభాభ్యుదయం' పేరుతో పద్యకావ్యంగా వచ్చింది. క్రీడాభిరామంలో శ్రీకాకుళక్షేత్ర విశేషాలు గొప్పగా వర్ణించబడ్డాయి. దాంట్లో ఇప్పటి పద్యకవితాబ్రహ్మోత్సవాలకు స్ఫూర్తినిచ్చే పద్యం ఒకటి ఉంది.

ఈరసమెత్తువేదములు హ్రీవహియించు పురాణజాలముల్
సౌరభహీనమౌనుపనిషత్తులు వెంబడు నాగమావళుల్
గారవముల్లసిల్ల సిరికాకుళనాథుడు నాగదేవభ
ట్టారకు నాటబుట్టి ప్రకటంబగు వేడుక నాదరింపగన్

వేదాలు, పురాణాలు, ఉపనిషత్తులు, ఆగమాలకు మించిన గౌరవాన్ని శ్రీకాకుళాంధ్రమహావిష్ణువు తెలుగుపద్యానికి ఇచ్చి ఆదరించాడు. శ్రీకృష్ణదేవరాయలకు స్వప్నంలో సాక్షాత్కరించి తెలుగులో కావ్యరచన చేయమని ఇక్కడే ఆదేశించాడు.

మంచెన కేయూరబాహుచరిత్రలో శ్రీకాకుళబ్రహ్మోత్సవాలు గొప్పగా వర్ణించబడ్డాయి. అనంతామాత్యుడు భోజరాజీయంలో కృష్ణవేణి, మలాపహారిణి, భీమరథి నదుల మధ్య ఉన్న అంతర్వేదియైన పావనక్షేత్రంగా శ్రీకాకుళాన్ని వర్ణించాడు.

వేదాంతదేశికుల కుమారుడు వరదదేశికుడు శ్రీకాకుళాన్ని దర్శించి శ్రీకాకుళస్తవాన్ని అద్భుతంగా రాశాడు.

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానవిద్వాంసుడు లొల్లలక్ష్మీధర పండితుడు శాసనాల్లో శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువును గొప్పగా వర్ణించారు. పధ్నాలుగో శతాబ్దంలో బల్లమహారాజు స్వామివారికి తెలుగు రాయనిపాలెంగ్రామాన్ని ఇస్తూ పద్యశాసనం వేయించాడు.

తెల్గురాయనికళ్యాణ తిరుమహోత్స
వాదులకు దెల్గురాయల వారిపేర
గల్గుపాలెంబు నిచ్చె దా ఘనత మీర
సర్వకర పరిహారమై శాశ్వతముగ

కంచర్లశరభనకవి రచించిన ఆధ్యాత్మరామాయణంలో శ్రీకాకుళక్షేత్రప్రశంస ఉంది.

రాయల అనంతరం క్షీణించిన క్షేత్రవైభవాన్ని పదునైన తన 'ఆంధ్రనాయికశతకం'తో లోకానికి, జమీందారులకు తెలియచేసి పునరుద్ధరించిన కాసులపురుషోత్తమకవి అసమానశతకరచనకు పుట్టుకచోటు శ్రీకాకుళమే. 'శ్రీకాకుళశ్రీహరీ' అనే శతకాన్ని ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో చూసి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించారు.

నీవంధ్రావని నాయకుండవని నిర్నిద్రానురాగాప్తి నా
భావం బంధ్రకవిత్వరీతిని భవత్పాదారవిందస్తుతి
ప్రావీణ్యంబున నుండె బాలకృతదూరస్ఫారశీతాంశుబిం
బావాప్త్యర్థకర ప్రసారగతిదోపన్ కాకుళశ్రీహరీ!

తెలుగుపద్యానికి పట్టంగట్టి పునర్వైభవాన్ని తెచ్చే పద్యకవితా

బ్రహ్మోత్సవాలకు ఆంధ్రమహావిష్ణువు దేవాలయప్రాంగణాన్ని ఎంచుకోవటం సముచిత నిర్ణయం. గుడిలోనుంచి ఆంధ్రమహావిష్ణువు, ఆముక్తమాల్యదా మండపంలో నుంచి శ్రీకృష్ణదేవరాయలు చూస్తూ ఆశీర్వదిస్తూ ఉండగా ఈ ఉత్సవాలు జరగటం ప్రశంసనీయం.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు శ్రీకాకుళవర్ణనతో ఒక పద్యకావ్యం రాశారు.

వేటూరి సుందరరామమూర్తిగారు, జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు గారివంటి సుప్రసిద్ధ కవుల పద్యరచనకు స్ఫూర్తిని, ప్రేరణనిచ్చిన శ్రీకాకుళంలో జరిగిన పద్యకవితా బ్రహ్మోత్సవాలు యువతలో పద్యరచనను ప్రోత్సహిస్తున్నాయి.

ఏటా తిరువాయూరులో గాయకులంతా త్యాగరాజారాధనలో ఒక్క నిముషమైనా ఒక కీర్తన అయినా ఆలపించే కర్ణాటక సంగీత సంప్రదాయంలాగా తెలుగుపద్యకవులు ఎవరైనా, ఎక్కడివారైనా, ఎంతటివారైనా ఒక్కసారి శ్రీకాకుళం వచ్చి ఆంధ్రమహావిష్ణుసన్నిధిలో, 'దేశభాషలందుతెలుగులెస్స' అని ప్రకటించిన శ్రీకృష్ణదేవరాయసమక్షంలో ఒక్కపద్యమైనా వినిపించాలి. పద్యాన్ని బ్రతికించాలి అనే మహాసంకల్పంతో రూపుదిద్దుకున్న ఈసభలకు పద్యకవితా బ్రహ్మోత్సవనామకరణం జరగటం అద్భుతం. ఇది తెలుగుపద్యప్రక్రియకు దక్కినగౌరవం.

రెండుతెలుగురాష్ట్రాలు, ఇతరరాష్ట్రాలు, విదేశాల తెలుగువారు ఎందరో ఈసభలకు హాజరయ్యారు. వందలాదిమంది పద్యకవులు ఆ సభలలో జరిగిన కవిసమ్మేళనాలలో అసంఖ్యాకంగా పాల్గొన్నారు. వారందరికీ తగిన సమయం లభించలేదు. ఒకనిమిషం చదివినా ఆ కవితలు మొత్తం తెలుగుసాహిత్యంలో శాశ్వతంగా నిలవాలనే ఉద్దేశంతో ఒకకవితాసంపుటిగా తీసుకురావాలని తెలుగుభాషా సాంస్కృతిక శాఖ నిర్ణయించింది. ఆశాఖ ఆమాత్యులకు, కార్యదర్శి, సంచాలకులకు ధన్యవాదాలు. తెలుగుపద్యంతో ముడిపడిఉన్న అవధానం తెలుగువారి సొంతం. ఇద్దరు యువఅవధానులు వారిలో ఒకరు మహిళావధాని. వారు ఇద్దరూ కలిసి అష్టావధానం చేయటం ఈసభల విశిష్టత.

ఎందరో సుప్రసిద్ధ, యువ పద్యకవులు పాల్గొన్న పద్యకవితా

బ్రహ్మోత్సవాలు దిగ్విజయంగా జరగటానికి అహరహం శ్రమించిన డా॥ దీర్ఘాసివిజయభాస్కర్ కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్షులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు, కార్యదర్శి డా॥ జి.వి. పూర్ణచంద్ 'అచ్చతెలుగు అవధాని' డా" పాలపర్తి శ్యామలానందప్రసాద్ ఈ కవితాసంపుటికి కవితలు ఇచ్చిన కవులు (కొందరు పేరులేకుండా ఇచ్చారు) అవధానులు, కార్యకర్తలు, అధికారులు, అనధికారులు అందరికీ హృదయపూర్వక ధన్యవాదాలు.

'అతడె ఆంధ్రవిష్ణువితడహో! శ్రీకృష్ణ
దేవరాయ లిద్దరావహింప
గద్దెనెక్కె తెనుగుపద్దెంబు నేడిట
జయము తెలుగుతల్లి జయము జయము'

తెలుగుభాషా సంస్కృతుల పరిరక్షణకోసం ఇటువంటి కార్యక్రమాలను ప్రోత్సహిస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రివర్యులు గౌరవనీయ నారా చంద్రబాబునాయుడుగారికి ధన్యవాదములు.

**- మండలి బుద్ధప్రసాద్**

**శ్రీకృష్ణ దేవరాయ పద్య కవితా బ్రహ్మోత్సవాలలో భాగంగా**

**ది.19-02-2017న జరిగిన అష్టావధానము**

అవధానులు:

1. "అవధాన రాజహంసిని" కుమారి పుల్లభొట్ల నాగ శాంతిస్వరూప
2. "అవధాన అష్టాపద" శ్రీ తాతా సందీప శర్మ

సంచాలకులు: "శతావధాని" డా. పాలపర్తి శ్యామలానంద ప్రసాద్‌గారు

పృచ్ఛకులు:

నిషిద్ధాక్షరి - శ్రీ ఎస్.టీ.జి.కే. రంగాచార్యులు గారు

సమస్య - శ్రీ గుడిసేవ విష్ణుప్రసాద్ గారు

దత్తపది - శ్రీ మందారపు వేంకటేశ్వరరావు గారు

వర్ణన - శ్రీమతి ఎం.కే. ప్రభావతమ్మ గారు

వ్యస్తాక్షరి -

ఆశువు -

ఘంటావధానము - శ్రీ వలివేటి శివరామకృష్ణగారు

అప్రస్తుత ప్రసంగము - అష్టావధాని ఆముదాల మురళిగారు

**పూరణలు:**

నిషిద్ధక్షరి :

అంశం - శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణు దేవాలయంలో గోదా విగ్రహము నెలకొల్పాలని ఆకాంక్షిస్తూ పద్యం

కం. శ్రీరాద్వళియై మేటై
ఔరా! వేడ్కన్ సతమ్ము నాండాళ్ మాలన్
శ్రీరమణీయత పతికిడ
కోరెద గోదా సతికిట కోవెలనొకటిన్.

సమస్య: "బదులే కష్టములకెల్ల పరమపదంబుల్"

కం. ఒడిదుడుకులు దాటంగన్
బుడుతల తగు రీతి దిద్ది పోషింపంగా
బడిపంతుళ్ళకు నా రా
బదులే కష్టములకెల్ల పరమపదంబుల్

దత్తపది: బలరామ, భీమ, సుయోధన, శ్రీకృష్ణ పదాలతో రామాయణార్థంలో ఉత్పలమాలో పద్యం చెప్పాలి

ఉ. విష్ణువు రాముడై తనరు ప్రీతిని, ధీబలరామ గాధ, రో
చిష్ణుడు నౌచు భీమ గతి చీల్చెను రావణు వంటి దైత్యులన్
ఉష్ణపు తాకిడుల్ వడసె నుర్వి సుయోధన వర్గమెల్ల, శ్రీ
కృష్ణ భవంబునయ్యెనట కేళిగ గోకులమందు ద్వాపరన్

వర్ణన: "పద్యసౌరభము"

మ.కో. పద్యమన్నది యెల్లవారికి వర్మమై తనరారుగా
ఖాద్యమయ్యెను తెల్గు జాతికి క్రాంతదర్శకమయ్యెడిన్
హృద్యమౌనిట చెప్పినంతనె హేలగానగుపించుచున్
సద్యశమ్ముల నిచ్చు గావుత సాహితీ సమరంబునన్

వ్యస్తాక్షరి: "కృష్ణదేవరాయ కీర్తికాయ"

అశువులు:

1. ఇస్రో చేపట్టిన 104 ఉపగ్రహాల విజయముపై...

ద్వి. భారతీయుడు చూడు పండుగ ఇద్ది
తారాపథంబున తళుకులు మీరె

2. వేంకటేశ్వర స్వామి, కృష్ణరాయనికి జరిగే ఈ బ్రహ్మోత్సవాలు చూసి ఏమనుకొంటాడు?

కం. నాకున్ జరిగెడు వేడుక
లోకువ ఈ వేడ్కముందు, లోకములోనన్
నీకున్ జరిగెడు వేడుక
ఈ కవి కులమందు సతము నింపున్ గూర్చున్

# తెలుగు పద్యకవితా బ్రహ్మోత్సవములు, శ్రీకాకుళం

# (కృష్ణాజిల్లా), కవిసమ్మేళనం

నిర్వహణ : 'అసమాన అవధాన సార్వభౌమ'

డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్

స్వాగతము పద్యకవులకు స్వాగతమ్ము
తిరువయూరుకు గాయకు లరిగి యచట
గానమొనరింప భాగ్యముగా తలంతు
రటులె శ్రీకాకులమున పద్యము చదువుడు

పద్యమ్మె తెలుగుప్రాణము
పద్యమ్మే తీర్చిదిద్దు వ్యక్తిత్వమ్మున్
పద్యమె సారథి సచివుడు
పద్యము బ్రహ్మోత్సవముల వర్ధిల్లునికన్

ఎన్నో బ్రహ్మోత్సవములు
పన్నుతముగ దేవళముల సాగుచునుండున్
సన్నిధిని ఆంధ్రవిష్ణువె
పన్నెను తొలితెలుగు పద్యబ్రహ్మోత్సవముల్

తిట్టగ పొగడగ నవ్వగ
గట్టిగ ఏడ్వంగ గుండె గడియలు దీయన్
చుట్టరికమ్ములు నిలుపగ
పట్టంతయు దాగె తెలుగుపద్దెములోనన్
అతడె ఆంధ్రవిష్ణు వితడహో! శ్రీకృష్ణ
దేవరాయ లిద్దరావహింప
గద్దె నెక్కె తెనుగుపద్దెంబు నేడిట
జయము తెలుగుతల్లి జయము జయము

## తెలుగు వెలుగది దిశల వర్ధిల్లు సతము!

- విహారి

శ్రీ కృష్ణదేవరాయలు
వాకొని చే కొనిన - 'లెస్స' - భాషాకీర్తిన్
శ్రీకాకుళమందుకొనియెను
ప్రాకట నవ్యాంధ్ర లక్ష్య భవిత స్ఫూర్తిన్

మల్లెలు విచ్చినట్లు, తెలిమబ్బులు బొమ్మలు కూర్చినట్లుగా
అల్లన సాగిసాగి జలహాసము రాసము నేర్చినట్లుగన్
పెల్లుగ కప్పురంపు జిగి బెళ్కుహొరంగు విదిర్చినట్లు - రా
గిల్లుచునుండె నేడిచట కృష్ణజయేంద్రయశోవిశేషముల్

రాయల సత్కళా రాణ్మూర్తివిస్ఫూర్తి
మాన్యమంత్రివర సన్మతినయించు
భువన విజయసభా పూర్ణభవత్శోభ
కావ్యగానాల పొంకములు సూప
సంస్కృతి విభవమ్ము సామాజికాదృతి
ఉత్సవశోభలో నుల్లసిల్ల
కుందేళ్లగుమి వేటకుక్కల దరిమిన
ధైర్యమ్ము ప్రజలలో తరగలెత్త
పద్యసుకవితా బ్రహ్మోత్సవముగ వెలసె
తెలుగు భాషాభ్యుదయ కార్యదీప్తి పెనుచ
జరుగవలసిన కర్తవ్య సరణి జరుప
నిట్టిసంబరమెప్పుకు హెచ్చరించు!

తెలుగురాని గురువు చేత తెలుగుచెప్పింపగారాదు
తెలివి పేరున చట్టసభలు 'తెలుగాంగ్లము' 'దంచ'రాదు
తెలుగు సాంస్కృతికోత్సవాల 'తెలుగదే'సున్న కారాదు
కలములున్, కుంచెలున్ తెలుగు కలిమిపాడొనరించరాదు

నేయి ద్రావుచు దప్పికన్ దీర్పలేము
అటు ప్రభుత, ప్రసారమాధ్యమములవియు
ఇటు ప్రజలు నిబద్ధత నేర్చినపుడె
తెలుగువెలుగది దిశల వర్ధిల్లు సతము!

# తెలుగు భాషా వైభవం

- ఆచార్య ఎస్.గంగప్ప

తే॥గీ॥ అందమై చెవికింపుగా నంతమందు
అచ్చులుంట తెలుగుభాష మెచ్చు భాష;
సహజ సంగీతభాషగా సరసమగును;
సందియము లేదు; నిజమగు! సారసమ్ము! 1

తే॥గీ॥ తెలుగు జాతీయముల తీరు తెన్నులగతి,
తెలుగునుడికారపు సొగసు తియ్యదనము;
తెలుగుపలుకుబడిని బాగ తెలుపుపదము
లెన్ని భాషలున్న తెలుగు మిన్నరన్న! 2

ఆ॥వె॥ తెలుగు దనమె మనకు తెలుగు ధనమగును,
తెలుగుమాట మనకు తేటమాట!
తెలుగుపలుకు మనకు తీయనయిన తేనె,
తల్లిపాలు మనకు తల్లిభాష! 3

ఆ॥వె॥ ఆంధ్ర విష్ణువాక్కు ఆలోచింపనిజము;
'దేశభాషలందు తెలుగు లెస్స' !
రంజుగాను కృష్ణరాయలు గ్రహియించె;
పరుల భాషలయందు పలికియుంట! 4

ఉ॥ నన్నయ తిక్కనాది కవినాథులు సారస సంభ్రమాలతో
వన్నెలు గూడగా కవిత వాసిగనంగ యశోభిరామమై
మన్నన పొంగగా విపుల మాన్య కళాసుశోభితమ్ము; ఆ
అన్నులమిన్నగా మిగులఖ్యాతిని పొందగ సొంపరెన్భళా! 5

## తెలుగువెలుగు

- వారణాసి సూర్యకుమారి

1.సీ. వాగ్దేవిమనకిచ్చె వరముగ తెలుగును
మన మాతృభాషయై మహిని వెలుగ
అచ్చులు, హల్లులు అక్షరమాలయై
అంబకంఠాభరణంబునొప్పు
నవరసమ్ముల భాషనవరాగమిళితమై
నలువరాణికి చిరునగవునొప్పు
పదములన్నియు వాణిపాణిని వీణియ
స్వనమనంగ తెలుగుస్వరములొప్పు

తే॥గీ॥ వ్యాకరణమలంకారమున్ వరుసనగును
దేవిపసిడి కిరీటాన దివ్యమణులు
తెలుగు ఛందస్సు నుదుటను తిలకమనగ
భారతికి ప్రీతికరమైన భాష తెలుగు ॥

2. ఆనందప్రదమును, ఆదర్శప్రాయమ్ము
దేశభాషలయందు తెలుగులెస్స!
అని కృష్ణదేవరాయలువారు ప్రీతితో
తెలుగుపై మక్కువ తెలిపిరపుడె
ఆముక్తమాల్యద నావిష్కరించిరి
ఆంధ్రులభాగ్యవశంబుననగ
తెలుగు పద్యమ్ములు కలిగించుభాషకు
ప్రత్యేక శోభను ప్రణతులనగ

తే॥గీ॥ తేనెలూరుచు విలసిల్లు తీరుతెలుగు
నలుదిశలకును ప్రసరించు వెలుగు తెలుగు
తెలివితీగలనడిపించు తీరు తెలుగు
పలువురి ప్రశంశలందెడు పసిడి లెలుగు॥

3.సీ. విశ్వభాషలలోన వెలుగులీను తెలుగు
మధురాతి మధురమైమదిని దోచు
తెలుగుభాషవినగ కలుగు వీనులవిందు
సంగీత ఝురివోలె సాగునంత
వ్యవహారభాషగా వర్థిల్లుమేలౌను
తెలుగుభాషఘనత తెలిసివచ్చు
వాడుక మాటలు వేడుక గొలుపుచు
ప్రాంతీయభేదము బాపవచ్చు.

తే॥గీ. అమ్మభాష కమ్మదనము అక్షయమ్ము
శిక్షణగనేర్చుకొనుటయే లక్షణమ్ము
దేశవాసులును విదేశ వాసులైన
చక్కనియవగాహనపొంద సాధ్యమగును॥

# ఆంధ్రప్రశంస

- డా॥ గుఱ్ఱం ధర్మోజీరావు

9949263267

సీ॥మ॥ హృద్యమై పద్యమై హృదయ నైవేద్యమై
ఆరాధ్య సద్యశమ్మలరు తెలుగు
దివ్యమై భవ్యమై దేదీప్యకావ్యమై
నిష్యంద ఛందమై నిలచు తెలుగు
రమ్యమై, గమ్యమై రసరాజ్యకామ్యమై
సమ్యగ్వివేకమై సాగుతెలుగు
నృత్తమై, నృత్యమై క్రొత్తదౌభంగిమై
చిత్తమ్ము హత్తెడి జిలుగు తెలుగు
కృష్ణరాయని సభన్అష్టదిగ్గజముల
ప్రాబంధ సౌగంధ ప్రభలు తెలుగు
అలనాటి, పలనాటి ఆంధ్రరోషముచాటి
వీరగాధలతోటి వెలుగు తెలుగు
పీఠికాపురరాజ పేటికావిభ్రాజి
సుపటీర సుమగంధ శోభ తెలుగు
జాను తెనుగులోన జాలు వారినయట్టి
జాషువా కైతల జాణతెలుగు

ఆ॥వె॥ ఇట్టి పుణ్యభూమి పుట్టితి నీకృప
అంజలింతు తల్లి ఆంధ్రమాత
సకల సంపదలను సరిలేనిమేటివి
తెలుగువెలుగులమ్మ తేనెలమ్మ"

# ఆంధ్రశ్రీమహావిష్ణుదేవా!

- 'శతావధాని' డా. అబ్బిరెడ్డి పేరయ్యనాయుడు

9959771709

సీ॥ జీవన్నదీ తోయ జృంభణాఖండ స
స్యశ్యామలాంధ్ర దేశంబునాది
అసమాన తెలుగు రాయడనేననెడి తెల్గు
వాల్లభ్యగరిమవైభవము నాది
పలికినంతనె యన్యభాషానుభావ వి
స్మృతి నల్పముగ జేయు తెలుగునాది
దేశభాషలయందు దేదీప్యమానమై
నిలుచు నుజ్జ్వలభాష తెలుగునాది

తే॥గీ॥ అనుచు, దివ్యప్రసాద జన్యప్రశస్తి
అమరతాభాస్వరాక్షరాహ్లాదయుక్తి
తెలుగుజాతికి నెసగించు దేవదేవ
ఆంధ్ర శ్రీ మహావిష్ణుదేవా! నమస్సు.

ఉ॥ శ్రీకమలామనోహర విశేష! వికుంతము వీడు దొక్కొ? శ్రీ
కాకుళమే వికుంతముగఁగ్రాలుదువయ్య! మహేంద్రభూమియే
ఆకులపాటు లేక, సుఖియౌఁగద! నిశ్చల మానసాంబుధిన్
నీకు నుదారతల్పముగ నెక్కొనఁజేసి భజించుభావనన్.

సీ॥ శ్రీ నాగమాంబాన్నృసింహదాంపత్యంబు
ఫలియించి, ప్రభవించి, ప్రబలునెవడు

నిజవాహఖురకోటినిర్ధూత ధూళి ధూ
సరితారి రాజన్యచంద్రుఁడెవడు
నృత్యసంగీతసాహిత్య నిత్యవినోద
రసపారవశ్యవిశ్రాంతుఁడెవఁడు
వాని శ్రీకృష్ణదేవరాట్పార్థివేంద్రు
మూరు రాయరగండాది భూరిబిరుదు
సాహితీ సమరాంగణ చక్రవర్తి
హార్దికమ్ముగ సర్వదా యభినుతింతు.

# నా విష్ణువు

- "సిరికవి" డా. చింతలపాటి మురళీ కృష్ణ
9441271135

**శార్దూలము :**

తల్లీ! రాజ్యరమావినోదిని! మహత్వంబెల్ల నీదేకదే!
చల్లంగా కనువిప్పి చూచునెడలన్ సర్వస్వమిప్పింతువే!
యుల్లాసంబుగ నాదు పద్య కవితాయుర్వేదవిద్యా ఝరిన్
సల్లాపంబులొనర్పవే- సుకవితా సామ్రాజ్యమేలన్ గదే !! 1

**మత్తకోకిల :**

"తెనుగులెస్స" యటంచుమెచ్చిన దివ్య మూర్తిని నీవెరా!
తెనుగుతేజము చాటినిల్చిన దేవుడెవ్వడు? -నీవెగా!
తెనుగు "మండల కృష్ణరాయడ!" ధీరవర్యుడ వీవెరా!
యనుగుబిడ్డను కాపుగానిడి యందగించితివేమిరా ! 2

**ఉత్సాహ :**

రాజ్యలక్ష్మి తోడునిల్చి రక్షరేఖలీయగా
పూజ్యతముడ వైతివీవు పుణ్యజనులు కొల్వగా
రాజ్యమేలినట్టి దేవరాజు వన్న నీవె ! సా
యుజ్యమిచ్చి బ్రోవరా ! వియోగ మింక చాలురా ! 3

ఉత్పలమాల :

మీసము దువ్వి మీ సములు మేకొని లేరని చాటిచెప్పి యా
యాసములేక నింతవరకాంధ్ర జగత్తును నేలుచుంటివే?
నీ సముడెవ్వడీ యవని - నెవ్వగ బాప సమర్థుడే ప్రభూ !

దోసములెంచబోకు ! భవదుఃఖము బాపుము కాకుళేశ్వరా ! 5

సీ. ఆంధ్ర విష్ణువు పేర నవనిలో వెలసిన
ఆదిదేవుడ! జోత లందుకొమ్ము !
శాతవాహన దివ్య చక్రవర్తివి నీవు
శక్తిశాలివి - మాకు ముక్తినిమ్ము !
తీయని భాషను దేశానికిచ్చిన
తెలుగు రాయడ మాకుతెలివి నిమ్ము!
చాతుర్యధుర్యతన్ చతురబ్ధినేలిన
మీసాలదేవ ! మమ్మేలుమయ్య !!

గీ. రెండు తలలెత్తి తెలుగువా రేడ్చు చుండె -
కేలు ముకుళించి తెలుగుకై కృష్ణరాయ !
ముద్దుబిడ్డలు నినుజూచి మురియునట్లు -
తెలుగు గంగను పొంగించి తేజమిడర !! 6

## శ్రీకృష్ణరాయవిభుడు

- డా. అక్కిరాజు సుందరరామకృష్ణ

98850 20205

సీ॥ ఆంధ్రభోజుడటన్న ఖ్యాతినార్జించిన
మొనగాడు శారదామూర్తి సముడు
అప్పాజి కనుసన్న నలరిన బిడ్డండు
వర్థిష్ణులైనట్టి ప్రభుడితండు
ఉయ్యాలబల్లపై సయ్యాటలాడెడి
బేలచిన్నమ దేవిప్రియుడితండు
పరమధూర్తుండన్న ప్రఖ్యాతిగాంచిన
పాండురంగ కవికి పరమసఖుడు
అష్టదిగ్గజ కవులతో అనుదినంబు
తమినికవిగోష్ఠి సలిపిన ధరణివిభుడు
వైశినరపాళికదె పక్కబల్లెమితడు
ప్రథితుడాతడె శ్రీకృష్ణరాయవిభుడు

సీ॥ శ్రీవిరూపాక్షుని చెల్వంపుదీ వెనల్
ఫలియింపవరలిన ప్రభుడవీవు
సింహగిరీశుండు శ్రీ రమానాథుని
ఆశీర్బలంబున్న అయ్యవీవు
భావజరూపుండు శ్రీవిఠ్ఠలునిదైన
ఉరుకృపన్ వరలిన నరుడవీవు
దేవదేవుండైన తిరుమల వేంకనన్

కదునిష్ఠగొల్చిన ఘనుడవీవు
విష్ణుదాసుల మముబోంట్ల విమలయతుల
సతతమును గొల్చి సుతులనందితివి నీవు
అవని రాజ్ఞీత్రయమ్ముతో అలరినట్టి
నరసరాట్పుత్ర నీకివేనతులు నుతులు

## ఆంధ్రభోజుడా!

- డా. గుమ్మా సాంబశివరావు

9849265025

1. తే॥ రాజకవివీవు కవిరాజ రాజ ! వైరి
రాజ కంఠలుంఠన మృగరాజ! అష్ట
దిగ్గజ సుకవి రాజస్తుతి ప్రకాశ।

దివ్యగుణరాజ! శ్రీకృష్ణదేవరాయ.

2. తే॥ అల్లసానికవీంద్రుని ఆదరించి
గండ పెండేరము తొడిగిగౌరవించి
అగ్రహారమ్ములిచ్చిన ఆంధ్రభోజ

సాటియెవ్వారు నీకింక సాహసాంక।

3. సీ॥ వేదధర్మములను ప్రేమతోరక్షించు
మత్స్యావతారుడా! మహితచరిత।
భూమిభారమ్మును భూరిశక్తిని మోయు
కూర్మావతారుడా!కువలయేశ।
భూమికి భారమౌపుడమీశులనుగూల్చు
భార్గవరాముడా! భవ్యకీర్తి।
పరదారలనుబట్టు పరమదుర్మార్గులౌ
రావణులను గూల్చు రామచంద్ర।

గీ॥ భూతదయశక్తి బోధించు బుద్ధదేవ
సకల దేవతా మూర్తుల సంచరించు

దివ్యతేజో విరాజ! ఓ దేవరాయ!
శాశ్వతమ్మోయి నీకీర్తి ! సత్కవీంద్ర!

4. చం॥ జనులకు నెల్ల వేళలను సంతస మొప్పగ రాజ్యపాలనన్
ఒనరగ చేసినట్టి పరమోన్నత కీర్తులు రాజులెందరో
కనుమరుగైరికాలమున - కాని కవీంద్రుల పోషణమ్మునన్
తనరుచు నుంటివిప్పటికి! ధన్య చరిత్రుడ! కృష్ణరాయడా!

5. సీ॥ మరచిపోలేదు నీ మహనీయశౌర్యమ్ము - తీరాంధ్ర దేశమ్ము స్థిరయశుండ!
వాడిపోలేదు నీ ప్రతిభాపరిమళము - ఆముక్త మాల్యద అలరుకతన
చెఱగిపోలేదునీ శిలల శాసనములు - తిరుమల క్షేత్రంపు తీరుకనగ
తఱిగి పోలేదునీ దాతృత్వ మహిమమ్ము. అష్ట దిగ్గజపు కావ్యాల వలన

తే॥ ఆంధ్ర విష్ణువు కలలోన నవతరించి
తెలుగు కావ్యరచనకు నాదేశమిడగ
సాహితీ సమరాంగణ సార్వభౌమ
ఖ్యాతినందితే కృష్ణరాయాధినాథ

# "అందుకోమానివాళిని ఆంధ్రభోజ"

- అజ్మీరు వీరభద్రయ్య

9290879849

1. చం॥ సిరులకు నాలవాలమయి శ్రీకరమైన కళావిలాసమై
తిరుమలవేంకటేశ్వరుని దివ్యశుభమ్ముల పుణ్యధామమై
పురములు, పల్లెలన్నియు ప్రబోధమొనర్చుచు సుప్రసిద్ధమై
అరయగనొప్పుచుండినది ఆంధ్రవసుంధర కృష్ణరాణ్ణిపా!

2. సీ॥ సంస్కృతకన్నడ సాహిత్యమంజీర
ఘులుఘల్లునాదాలగతులు మురియ;
ఆంధ్రకర్ణాటకలద్వైత తేజమై
సాహితీ పరిమళఝురులుకురియ;
విపులవిపంచిగావిష్ణుచిత్తీయమై
చూడ్కుడుత్తమ్మశోభలరయ;
ఆంధ్రమహావిష్ణువాశీసులనుఁబొంది
ఆంధ్రభోజుండన్న ఖ్యాతిమెరయ

తే॥గీ॥ భువన విజయమునం దుసమ్మోదమంది
ప్రభవమొందెను దివ్యప్రబంధములుగ
దేశభాషలలోకెల్ల తెలుగులెస్స
యనెడుమధురోక్తి ఆదర్శమయ్యెమాకు।

3. ఆ॥వె॥ సమరరంగమైన సాహితీరణమైన
కదనమైనగాని కవనమైన

వడుపునేర్పుజూపి ప్రజ్ఞావిశేషాన
నిర్వహించినావు సార్వభౌమ।

4. ఆ॥వె॥ తెలుగుభాషలోని తీయందనమ్మును
కన్నడమ్ములోని వన్నెలన్ని
ఆకళింపుతోడఆపోశనముపట్టి
మాలకట్టినావు మాన్య చరిత।

5. సీ॥ విడినపూవులదండ యెడదపోసులలోని
సరసతనెరిగినసార్వభౌమ;
శృంగారభక్తిని పొంగులు వారించి
రసికత తెలిపినరాన్నృపాల;
స్నిగ్ధసింగారాలముగ్ధగోదావరి
పల్లవించిన భక్తి పాశురముల
రైతుముంగిళ్ళలో రమణీయతను జాటు
రంగవల్లులలోని రమ్యమెరిగి;

6. తే॥గీ॥ పరవశత్వమో? రసికతో; భక్తి రసమొ
మురళిమోహనమో? దివ్యపూర్ణగతియొ?
ఆత్మపరమాత్మసంధానమయ్యేనేమొ?
మమతకోవెల ఆముక్తమాత్యదయ్యె!

# సంస్తుతి

- ఎరుకలపూడి గోపీనాథరావు

98482 93119

సీ॥ శ్రీకృష్ణరాయల - శ్రేయఃప్రదాశ్రయ
శ్రీలందు భాగ్యమ్ము / చెల్లె ననుచు
సత్కవీశుల - శ్రేష్ఠసాహిత్య / సుధగ్రోలు
మంచి కాలమ్మంత / రించెననుచు
రహదారుల పయిన - రత్న రాసులనమ్ము
పోడిమిప్పుడు మాసి / పోయెననుచు
జనకుని వోలె/భూజనుల కాచు ప్రభువు
తమను వీడి దివికి / తరలె ననుచు

తే॥గీ॥ సుకవిలోకాత్మ / జాలిగా/ స్రుక్క దొడగె
వాణి హృదయమ్ము / బాధతో / వగవ సాగె
వర్తకాళి చింతించుచు / పల్లటిల్లె
దేశవాసులు దీనులై / దిగులు చెందె!

సీ॥ అష్టదిగ్గజ కవు / లాత్మీయముగ నిన్ను
ప్రాధేయపడి పిల్చె / రాజ! రాజ!
శిల్పులున్, గాయకుల్, చిత్రకారుల మనం
బామతించెను నిన్ను / ఆంధ్ర భోజ!
కాళహస్తీశు / భవ్యాలయ శిఖర ని
ర్మాత! నిన్స్మరియించె / మదన రిపువు
భూరి కాన్కలనిడి / పూజించి నట్టి నిన్
దలచె నిత్యమ్ము / సప్తాద్రి విధువు

తే॥గీ॥ రాజ! రావయ్య మరలి మా / ప్రాంతమునకు
స్వామి ! సుఖశాంతులనిడు మా / స్వాంతమునకు
ఆంధ్ర మున్నేచు నాగ్లంపు / ధ్వాంతమునకు
కడచె కాలమ్మని తెలుప / కదలి రావె ।

సీ॥ ఆంధ్రమహావిష్ణువైన / శ్రీకాకుళ
స్వామి / తా / కోరంగ / స్వప్నమందు
'ఆముక్తమాల్యదన్' / హరిభక్తి యుక్త / కా
వ్యమ్ముగా / మలిచిన / వల్లభునకు,
ప్రకృతి వర్ణనములు, /ప్రజల జీవనశైలి
నద్భుతముగ / కావ్యమందు / నిలిపి
పంచకావ్యములందు / నెంచబడు కృషిని
రచియించినట్టి / సమ్రాట్టునకును

తే॥గీ॥ గుడులు / గోపురాల్ / కట్టిన / గొప్ప గుణికి
వినుత / విద్వన్మణికి / శూర / వీరునకును,
రతిపతిని బోలు / శ్రీకృష్ణరాయలకును
నతులనందించు / జేజేల / శతముతోడ !

తే॥గీ॥ ప్రజను ప్రేమించి / పాలించి / ప్రణుతులంది
సురుల సేవించి / పూజించి / స్తుతులు పొంది
తెనుగు బాసను / పోషించి / గణుతి కెక్కి
మాన్యభూవరా! / నీజన్మ / ధన్యమయ్యె

# శ్రీకృష్ణదేవరాయ మహోత్సవం - 2017

- ఎం.కె.ప్రభావతి, ద్రోణాచలం

తొలి తెలుగు మహిళా అష్టావధాని

సీ. శ్రీకృష్ణరాయలు / శ్రీ కాకుళమ్మున
శ్రీకారమునుఁజుట్టె / సిరితెలుగుకు
ఆంధ్రమహావిష్ణు / నానతిఁదలఁదాల్చి
ఆముక్తమాల్యద / నతనికొసగె
ఆంధ్రప్రభుత్వపు / టానతిమేరకు
ఆంధ్రభాషాయోష / యమలరుచుల
మూడు నిమిషముల / ముచ్చట తెలుపంగ
అవకాశమీయంగ / నందుకొంటి

ఆ.వె. భాష గొప్పదనము / పద్యాల పేర్కొంచు
నిట్టి నిధిని నిలుప / గట్టిపట్టు
పట్టప్రజను ప్రభుతఁ / బ్రార్థించుచుంటిని
జయము తెలుగుతల్లి / జయము జయము 1

ఆ.వె. వేయివేండ్ల నుండి / వెలసె సాహిత్యమ్మ
తేనెలూరునట్టి / తెలుగునందు
రాసియందెకాక / వాసియందు ఘనమ్మ
తెలిసిమసలుకొనుము / తెలుగువీర 2

ఆ.వె. సంస్కృతమ్ములోని / సౌష్ఠవమ్ముగొనుచు
అచ్చుతెనుగుపదము / లందు పొదిలి
పసిడిరాగికలిపి / పైడి భూషలఁజేయు
రీతి వెలసెతెనుఁగు / ప్రీతిఁగూర్చె

తే.గీ. భాషలెన్నియోనేర్చిన / ప్రభువతండు
కృష్ణరాయలు పట్టిన / కేతనమది
దేశభాషలలోలెస్స / తెలుగునుమ్మ
దేనినే ధ్రువపరచిరి / దేశకవులు 4

ఆ.వె. అమరభాషలోని / యతులను చేఁగొని
అచ్చుహల్లుమైత్రి / నందు చేర్చి
కన్నడంపుప్రాస / కలగల్పినన్నయ
తెలుగుపద్యములను / తీర్చినాడు 5

కం. ఎన్నో ప్రక్రియలిటగల
వెన్నెన్నోకతలునవల / లెన్నో కావ్యా
లెన్నో చిత్ర కవిత్వాల్
మున్నెన్నడు కననివినని / మోపెడు మెఱపుల్ 6

తే.గీ. నన్నపార్యుని కాలము / నాటినుండి
నిధుల గూర్చుకొంచుతెనుగు / సుధలచిందె
ఆంగ్లమేకాక చేపట్టె / సన్నిదేశ
భాషలనువాద సంపత్తి / వరములంచు 7

తే.గీ. దేశ్యపదములే కాకన్య / దేశ్యములను
నేర్పరచుకొనగ సమృద్ధి / యింపుగులుక
యాసలన్ని మాండలికాల / యందు వృద్ధి
తెలుగు పలుకుల జిలుగుల / కలిమి పెంచె 8

కం. ఎక్కువ అక్షరములచే
మిక్కిలి స్పష్టత పలుకుల / మేల్పట్టుండున్
చక్కని పాటలు పద్యా
లిక్కలిమిని పెంచు తెనుఁగు / హితకరమయ్యెన్ 9

# పద్మ పద్మాకరం

- డా. సిహెచ్. బాబావలిరావు

9989792247

నన్నయ్య పద్యంబు నెన్నడల సొబగు
తిక్కన్న పద్యంబు తేజియాట
రాయల పద్యాలు రతనాల రాసులే
శ్రీనాథు సీసాలు సిరులపంట
పోతన్న పద్యాలు పూతరేకులరుచి
త్రిపురాన పద్యాలు తీపిరూపు
పెద్దన్నపద్యాలు బెల్లంపు అరిసెలు
తిమ్మన్నపద్యాలు కమ్మనిరుచి

పద్యమదియె సుఖము గద్యంబు కన్నను
తెనుగుపద్యమద్దితేనెవాగు
లేదు దానికెందు లేనితనమెపుడు
కొనలు సాగునద్దికోర్కెమీద

పద్యమంటె జానె పద్మాకరంబెగా
పద్యమెంతొ తీపి పాలధార
పద్యవిద్యగాదె బహుగుణ భరితంబు
పద్యమెంతొ ప్రీతి పండితులకు

# విరులబాట

- డా. దీర్ఘాసి విజయభాస్కర్

1. కార్యసాధకుండు కాబోవు పనికిని
ఒడలి నొంచు చుండు ఓరితోడ
ఎంత లోతు వొంగు ఏతాము నీళ్ళకై
విజయుడన్న మాట విరులబాట.

2. తేటి తేనె తెచ్చి తెలుఎదెవ్వరికిని
మంచిపనులు జేయ మనుజుడెపుడు
మదిని తలచుగాని మందితో పలుకడు
విజయుడన్న మాట విరులబాట.

# ఆంధ్ర విష్ణుప్రభూ!

- మెట్ట వేంకటేశ్వరరావు

శ్రీ కాంతా విలసన్మనోహర మహేంద్రిన్ కృష్ణవేణీ తటిన్
వైకుంఠీకృత కాకుళాఖ్య నగరీవాస స్థితిన్పొల్చి అ
స్తో కస్తుత్యసుధర్మ పాలన కళాధుర్యుండవై ప్రీతిమ
మ్మా కల్పాంతమునిట్టె కాచుకొనుమయ్యా! ఆంధ్రవిష్ణుప్రభూ!

సీ॥ తెలుగు జోదులకత్తి తీవరంబెట్టిదో
ఔత్తరాహులకు మాడంటజూపి
శాంతిభద్రతల నుత్సారించు రాకాసి
మూకల చెండాడి ప్రోగులనిడి
కృష్ణాతరంగిణీ కృష్ణకుల్యావలిన్
రాష్ట్రంబు నన్నపూర్ణగనొనర్చి
ఆముక్త రచియింప ఆంధ్రభోజునకు
సంప్రీతితో కప్పుర విడెమొసంగి

అరనృపాలుర ఒత్తిళ్ల కడ్డకట్టి
రాష్ట్రమందున శాంతి భద్రతల నిల్పి
పల్లె పట్టులు బంగారు పంటలీన
దిద్దితివి స్వర్గసీమగ తెలుగునాడు
అఖిల హృదయరోచిష్ణుశ్రీఆంధ్రవిష్ణు
నీవొనరించినట్టె ధరణీభరణాంచిత కార్యముల్ మదిన్
ప్రోవిడి నిన్ను దైవముగ పూజలదన్నుచునుంటిమోప్రభూ
నీవలెనే మహాకృతులనేకములన్ పొనరించి మించి ఆం
ధ్రావళి మెచ్చులందు మహితాత్ములు రావలె రామచంద్రులై

# ఆంధ్రభోజుడు

- ఎం.పి.జానుకవి

9989124274

ఆ॥వె॥ దేశభాషలందు తెలుగులెస్సయనంగ
కావ్యరచనసల్పి ఘనతగాంచె
నాంధ్రభోజుడిచట, నరయగాశ్రీకాకు
ళాంధ్రదేవ నీ దయా సమృద్ధి !

ఆ॥వె॥ ఆంధ్రభోజుడనగ, నా చంద్రతారార్క
మైనకీర్తిగాంచినట్టివాని
భువనవిజయశోభమూలకందము కృష్ణ
దేవరాయలన్ నుతించుజగము!

ఉ॥ గండరగండడన్ బిరుదుగాంచిన శౌర్యధనుండ, సాహితీ
భండన సార్వభౌముదరి భంజన రంజనుడష్ట దిగ్గజో
ద్దండప్రబంధభాస్కరు డుదారగుణోజ్జ్వలు, డాంధ్రభోజుడ
ప్పండిత సత్కవీంద్రుకథపాడెదరాంధ్రులు దాత్త వైఖరిన్!

మ॥ రససిద్ధుండయి సాహితీవిమల సామ్రాజ్యంబు పాలించి, వి
శ్వసనీయుల్ తనవెంట నుండగమహోత్సాహంబుతోశత్రుసై
న్యసమూహంబుల నుక్క డంచి, తన రాజ్యంబందునన్ శాంతిసం
తసముల్నిండగ పాలనంబు సలిపెన్ దౌర్గత్యముల్వాయగన్!

ఉ॥ పొందుగ అష్టదిక్కరుల బూన్చి, తెలుంగుమహాకవిత్వమన్
స్యందనమెక్కి, వారధిగ, సారధిగా, భువనైకమోహనా

నందప్రబంధరాజములనంతజయం బొనగూర్పగా జగ
ద్వందితు డయ్యేకృష్ణ నరపాలుడుదగ్ర నిసర్గతేజుడై!

సీ॥ ప్రభుమంత్రశక్తిసంపన్నుడై, యాదర్శ
వంతుడై ఘనచక్రవర్తియయ్యె,
మూరురాయర గండవీరుడై శత్రురా
జన్యుల గూర్చి, రాజ్యమును నిల్పె,
ఆంధ్రభోజుండను, నాఖ్యన్ విరాజిల్లి
కవి జనాశ్రయుడయ్యు కవియునయ్యె

తే॥గీ॥ అష్టదిగ్గజ కవులసమాదరించి,
బహువిధంబుల రసవత్ప్రబంధసృష్టి
కిలను, కారకుడై, ప్రభాకలితుడయ్యె
రమ్యగుణశీలి! శ్రీకృష్ణరాజమౌళి!

సీ॥ అష్టదిగ్గజకవిత్వామృతాస్వాదనా
నందకందళితసుందరుడెవండు,
'ఆముక్తమాల్యద' యనెడుప్రబంధాన
కవిలోక విఖ్యాతి గాంచెనెవడు,
కృతులందుటకుపల్లకీమోసి, కవిజన
హృదయసామ్రాజ్యాలనేలెనెవడు,
రాతిలోజీవంబురవళింపగా, శిల్ప
కళనాదరించిన ఘను డెవండు

తే॥గీ॥ ఘంటమును, ఖడ్గమును నొక్క కరణి ద్రిప్పి
సాహితీసమరాలలో జయముగాంచి
తెలుగులున్నంతవరకు వర్ధిలునెవండు
నతడుశ్రీకృష్ణదేవరాయప్రభుండు!

# తెలుగులెంక - కృష్ణరాయలింక

- కిలపర్తి దాలినాయుడు

9491763261

సీ॥ అల్లసాని కవిని - పల్లకివట్టిన
అపురూప నృపుడవు - ఆంధ్రభోజు
ముక్కుతిమ్మన కవి - చిక్కని పల్కులన్
పోషించినాడవు - పుణ్యమూర్తి!
రామకృష్ణ కవికి - సుమమాల వేసియు
కవులకందరికిని - కల్పతరువు
వేంకటేశుని గొల్చి - వేవిధముల్ పూజ
సల్పిన భక్తుడా - సార్వభౌమ!

తే॥గీ॥ కృష్ణ భూవర తెలుగున - కృతుల నల్లి
రాచ కవియని కొనియాడి - రాజ్యమెల్ల
వ్రాసి యాముక్త మాల్యద - వాసి కెక్క
తెలుగు తేజమ్ము విరజిమ్మె - నలువమెచ్చ.

సీ॥ ఘంటమ్ము వట్టినన్ - కావ్యశతమురాశి
కత్తిబట్టినవేళ - కాలుడవుర!
రాజ్యపాలనమున - రాజతోరణములే
తెలుగు పోషకుడవు - తెలుగుఁఱేడఁ
అశ్వగమనమందు - ఆ దుర్జునుని బోలు
యుద్ధవిద్యలందు - పెద్దవీవు
భక్తిప్రపత్తుల - భాసిల్లగనులజేసి
వేంకన్న హృదయాన - వీపు నిలిచె

తే॥గీ॥ అష్టగజములు నీకోట - నమరియుండ
అష్టదిక్కులు నీమాట - లాడుచుండ
అష్ట కష్టముల్ పోవును - అదిరిపుండ
ఇష్ట సఖులయ్యేకవివరుల్ - యిలనుమీకు!

సీ॥ ద్విపదుల సరములో - దివ్యమ్ముగా వెల్గు
దివ్యభావనముర - తెలుగుభాష
కందమ్ములందున - అందమ్ములనుజిమ్ము
తేనెలూరెడి భాష - తెనుగు భాష
ఆటవెలదులందు - ననురంగన్నృత్యమై
నాట్యమాడిడి భాష - నవ్యభాష
తేటగీతులయందు - తేలియాడెడిభాష
పాటపాడునటుల - పల్కుభాష

తే॥గీ॥ సీసమాలికలందున - శ్రీలుగురియు
వృత్త పద్యపు చిత్తము - లత్తుకొనును
చెఱుకు గడలను మించెడి - చెల్వమలరు
తలపు లందున నిలిచెడి - తెలుగుభాష!

# తల్లిభాష

- యం. అంజయ్య

1. మాతృభాషకన్న మదురమైనది లేదు
మాతృప్రేమకన్న మరియు లేదు
మాతృదేశ మిలను మరియొక స్వర్గమ్ము
వాస్తవమ్ము గనుడు పౌరులార!

2. మాతృభాష పలుక మరచిన వారెల్ల
ఆంగ్లభాషపైన ఆసపడుట
మాతృహంతకులనుట మహిమీద నిజమయ్యె
వాస్తవమ్ము గనుడు పౌరులార!

3. మాతృభాషయనగ మన సంస్కృతికి గుర్తు
తరతరాల వరకు తరగని గని
మాతృభాషపైన మమతను చూపుచు
ఘన యశంబు పొంద కాంక్ష సేతు

4. తెలుగువారెనేడు తెలుగుభాషను బట్టి
తెగడు చుండెనయ్య తెలివిమాలి
తెలుగు కానివారె తెలుగు తీరును జూచి
తనివి తీర పొగిడి తనరుచుండె

5. నేడు తల్లిభాష నిపుణతవలననే
యశము నందినాడ నవనిలోన
జన్మజన్మలకును జన్మింతు తెలుగున
ఇంతకంటె భాగ్యమెందుగలదు

# శ్రీకాకులాంధ్ర విభునకు

# ఆకాంక్షా పద్యములను హారతులిడుదున్

డా॥ పోచినపెద్ది సుబ్రహ్మణ్యం

9848094625

"శ్రీకర విష్ణుదేవుని వశీకృతరూపుని గొల్చువాడనా
లోకన జేయ నిత్యముపురోగతి కల్గును పల్కుపల్కులన్
వ్యాకరణాది శాస్త్రముల పట్టులభించును పండితాళిసు
శ్లోకులవాణి, బాణి పలుచోటులలో విలసిల్లుచుండెడిన్
లోకమునందు పల్లెలును రూఢివెల్గగ దేవదేవుడే
ఆకృతిగా సమస్తమున నండగ దండగ నున్నవాడుది
వ్యాకృతులౌ మహర్షులు జయంకరులందరు పల్కినారు వా
రైకనుగొన్న సంగతులు హ్లాదముగా కనిపించుచుండెడిన్
కాకలుదీరు గ్రంథముల నంతము పుట్టగ కృష్ణమూలమౌ
స్వీకృతమైన కావ్యమును చేర్పమనంబున భావనాబలం
బాకృతిదాల్చుచున్ శత శతాధిక మేయగు గ్రంథరాజముల్
ఏకవికైన పుట్టి ప్రవహించు సుధారసమెంతయేనిశ్రీ
కాకుళమందు శ్రీవిభునిగాథలు విన్నదు విన్నజన్మమే
నాకము, కీర్తిరేఖలు గనంబగు, దీప్తిలభించు, శ్రేయముల్
ధీకలుముల్ లభించు పరితృప్తియు - దానికి సాటియేది యౌ
ప్రాకృత జన్మ బంధమది భాషలు భావములెల్ల నేర్చుచున్
వేకువగల్గి వేగముగ విస్తరణంబుగనాంధ్ర మందుభా
షాకలిమిన్ కృతుల్ రచన సల్పుచు నుండగ విశ్వనాథుడే

స్వీకరణంబు నొందగను జేయగ నద్ది వరప్రసాదమౌ
శ్లోకములేని పద్యములు శోభిలు వాక్కులునేని పల్కుగా
శ్రీకరి రాజరక్షకుని సేవలుగా దలపోయగావలెన్
నేకవనంబు నల్లగను నిత్యముశ్రద్ధగ పార్వతీసతిన్
ఆకృతిగొన్న పద్యములనంజలు లందగ జేయుచుండెదన్

# సౌందర్యమంజరి

- రఘురామమూర్తి పెదప్రోలు, "ఆయుర్వేదరత్న"
9346509735

"ఆర్ద్రార్థ దాయని యగు కల్పవల్లి,
భాషామతల్లియే ప్రతి జాతి తల్లి;
ప్రజలకు నేకోదర ప్రీతి గూర్చి,
జాతి కుటుంబముల్ సవరించును నుండు!
"జ్ఞాన తీర్థంబులన్, జలకంబు లార్చి,
సంగీత, సాహితీ, స్తన్యం, బొసంగి,
నాకంబు, భూలోక, మేకం, బొనర్చు
కల్పవల్లీ, డోలికల, పండబెట్టి
భావ హస్తముల తో పయిపయి నూచి,
పరమార్థముల జోల పాటలు బాడి,
ప్రకృతి వినోదంబులన్, పరికింపజేసి
ముద్దు బిడ్డల పెంచి మురియుచు నుండు
భాష పెంపక యున్న బసులము గామె?
భాష పెంపే మానవ ప్రాభవంబు! III, 1-14
(సౌందర్య మంజరి - కావ్య పరిచయము - 1934)

# తెలుగు భాషయే ప్రగతికి జీవధార

- బి.హెచ్.వి.రమాదేవి

9441599321

1.సీ॥ శ్రీలక్ష్మిశోభతో సింగారమొలికెడి
మొగలి పూవుల తావి ముద్దుతెనుగు
రాయల వైదుష్య ఛాయల నిలచిన
అష్టదిగ్గజముల
పోతన వేమనవ్రాతల జీవించు
దివ్యసూక్తుల సోన నవ్యతెనుగు
సంగీత సాహిత్య సంస్కృతి జిలుగుల
వెలుగులీను మధుర విద్యతెనుగు

తే॥ ఇక్షురసముల కావ్యంపు ఎడదతెనుగు
అక్షరాక్షతల్ దీవెనైయలరు తెనుగు
పతితులకు వీవెనై తూగు భళిరె! తెనుగు
ఆంధ్రులుద్ధతికిని చిహ్నమదియె తెనుగు

2. శ్రీకాకుళాంధ్రుని శేముషిగొలువంగ
ఆలయప్రాంగణ మంతనిలచె
ఆముక్తమాల్యదన్ అద్భుత పదిగిన
ఆంధ్రభోజుడిచట నందజేసె
కృష్ణాతరంగాల తృష్ణయువీడగా
తెలుగు గౌతమిధార తీయనకును
హరిహరి వాదమ్ము పరిపరివిధముల

తిక్కనార్యులసూక్తియె తెనుగువెలుగు

తే॥ పారిజాతంపు పరిమళ సరళితెనుగు
సన్నజాజుల సోయగసౌరు తెనుగు
ఎన్నె చిన్నెల సామెతలన్ని తెనుగు
అందచందాల హాయలొల్కు నదియెతెనుగు

3. చెమ్మ చెక్కల పాటల కమ్మదనము
వానగుంటల ఆటలవన్నెదనము
అమ్మయత్తల ఒడిలోని చెమ్మదనము
తెనుగు అణువణువున నిండె ఘనత బెంచె

# ఈనాటి తెలుగు(గో)డు

- డా॥ వూసల ఎఱ్ఱాశాస్త్రి

9014756393

1.ఆ॥వె॥తెలుగు సరిగ బలుక దెలియకున్నను గాని
అరుపు పదములాంగ్ల మందునుడువ
అదియ గొప్ప యతడె యాధునికుడు నేడు
స్వచ్ఛమైన తెలుగు నుచ్చరించ

2.ఆ॥వె॥పరమ ఛాందసుడని ప్రజలంత వాపోవు
సిగ్గు శరము లేక చింతలేక
ఆంగ్లపదములేక నసలొక్కమాటైన
తెలుగు పలుకలేడు తెలుగువాడు

3.ఆ॥వె॥దేశభాషలందు దెలుగు కున్న ఘనత
క్రమము క్రమముగాను కాలగతిని
అంతరించి యాంగ్లమల్లుకొనుచునుండె
పల్లె పట్న నగర ప్రజల నోళ్ళ

4.తే॥గీ॥ చదువు లేనట్టి సామాన్య జనులుకూడ
సారి, ప్లీజు, థ్యాంక్సు మరియు సారనుచును
అసలు వాటికి తెలుగులో యర్థమేమొ
తెలియకున్నారు ఈనాటి తెలుగువారు

5.తే॥గీ॥ సగమునాంగ్లము మరియును సగము తెలుగు
కలిపి మాట్లాడు సంస్కృతి ఘనత మనది
ఆంగ్ల పదమేదొ అసలైన యాంధ్రమేదొ
తెలియనోళ్ళె ఎక్కువ తెలుగుజాతి

6. ఆ॥వె॥ తిట్టు మాటగాని తీక్షణంబగు మాట
గాని-సూక్తిగాని కాని మాట
గాని యాంగ్లమందు గనుక మాట్లాడిన
చక్కగాను ఎక్కు తిక్కప్రజకు

7. ఆ॥వె॥ కడకు హాస్యమైన కన్నీటి మాటైన
సూటిగా హృదయము నాటుచుండు
మాయదారి యాంగ్ల మాయలో బడిపోయి
తెలుగుభాష తీపి దెలియదయ్యె!

8. తే॥గీ॥ కొన్ని తెలుగు పదములను తిన్నగాను
ఆంగ్లమందునె జెప్పగా నర్థమగును
తెలుగు పదముకు నాంగ్లము దెలుపకున్న
తెలుగు పదములసలేవొదెలియకుండె

9. ఆ॥వె॥ అంకులంటె "మామ" యదిగాక "బాబాయి"
అనుచు తెలుగు పదములప్పుడప్పు
పరిచయంబు జేయు పెద్దోళ్ళ చలువచే
ఉండెనింక తెలుగు యునికి గలిగి

10. ఆ॥వె॥ అదియుగాక దెలుగు నాంగ్లంబులోనేర్పి
అమ్మ నాన్న యంటె "మమ్మిడాడి"
అనుచు జెప్పు విధము అత్యంత చోద్యము
అమ్మ నాన్న పిలుపులసలు లేక

11. ఆ॥వె॥ ఆంధ్రరాజధాని అమరావతీ స్థలిన్
నేటి తెలుగుగోడు మేటియైన
ప్రముఖ కవులు రాష్ట్రపాలకులకు నిటి
చేతులెత్తి వినుతి జేయుచుంటి

# తెలుగుభాష - తెలుగుపద్యం

- 'సారస్వతకళానిధి'
డాక్టర్ వి.నాగరాజ్యలక్ష్మి

ఆ॥వె॥ తెలుగుతల్లి ఒడిలొతెల్లనిమల్లెలై
పరవశించు మనదు భాగ్యమేమి
ఏమినోముఫలమొ? ఏ పూర్వ పుణ్యమో
వెలసినాము మనము తెలుగునాట

ఆ.వె. భాషకంటె లేదు ప్రజల భవితమ్ము
కనుకమత్తు వదలి ఘనత తెలిసి
గర్వరేఖ మెరయగర్జింపరావలె
తెలుగువార మనుచు దిక్కులదుర.

తే.గీ. భాషలెన్నైన ముఖ్యంబు భావమెగద
అన్యభాషలన్గూడ నీవాదరింపు
కాని మణిగణాంచిత భూషగా నమరిన
రక్తమందొదిగిన భాష రక్తివిడకు

తే.గీ. పద్యమ్ము కవితల కాద్యమ్ము హృద్యమిందు
గణయతి ప్రాసముల్ రీవి గణనకెక్కి
స్నిగ్ధ భాషణ కనువైన చిన్నలుండు
శ్రమల కోర్చియునేన్ దీని చవులు గొనుము

తే.గీ. ధారణకు నిల్చుధారయై తరలివచ్చు
శ్రవణపేయమ్మునౌగాన శాంతిగూర్చు
కాలవాహిని నున్నత గతిని నిల్చు
పద్యములనాదరింపుడో పౌరులార!

# ఆంధ్రత్వం

- సన్నిధానం నరసింహశర్మ

9292055531

రాయల కబ్బపున్ హొయలు, రాయల కైతల తీగయల్లికల్
ఆయన లోతుచూపులు మహార్థసమీకృత భావవేగభా
షాయుత శైలి - ఏ ఇతరులందున లేవని స్వీయవైభవా
ధ్యాయ మహాప్రబంధ చరితాత్ముల మైతిమి స్వర్ణకాంతులన్

అబ్బురపాటు గొల్పు సృజనాత్మక వర్ణనలన్ గవిత్వపున్
మబ్బులనింద్ర కార్ముక సమానమహాప్రభలన్రచించె ఆ
నిబ్బరమైన మార్గమున నిర్మలభావరసాభిషేకమా
కబ్బమొనర్చె శారదకు - కావున రాయలకున్ బ్రణామముల్

నచ్చిన చచ్చుపుచ్చుకవనమ్ముల నాంగ్లమువంటి భాషలన్
దెచ్చెడు జబ్బుపోవలెను ధీనిధి రాయలలోతుకైతలం
దిచ్చిన విశ్వభాషలకు నీమనవైన తలల్ పతాకలై
విచ్చిన వర్ణపుష్పతతివేయన గోళమునన్ వెలింగెడిన్
రకరకమ్ముల వానలన్ దడియుతనుపు
ఆముక్త మాల్యద నందగలవు
వేడివేడి వలపు కూడిక లొనగూడు
దీర్ఘసమానంపు దీపములవె!
కావ్యప్రబంధసుగంధమువలెనన్న
రాయలకాలముద్రలనడుగిడు
ఒక స్వయంభువు కవితావలోకనముల
ఒక మహాప్రభువు పరిపాలకయుగముల
అతని కావ్యమ్ము చరితమ్ములద్భుతమ్ము
లవిగ్రహింపక నుండిన ఆంధ్రుడగునె!?

## రాయల దక్షత - రసజ్ఞత

**- కలవకొలను సూర్యనారాయణ**

1. అనితర ధైర్యశౌర్యముల కాకరమై, రిపుదంతి కోటికిన్
పెనుపడు సింహరాజమయి, భీకరదీర్ఘ నిశాతఖడ్గసం
జనిత సుదీప్తిపుంజ తతి చంచల తుల్యముగాగ బాటదే
గుణమణి కృష్ణరాయల యకుంఠిత కీర్తిని ఆంధ్రభూస్థలిన్

2. అలఘు కళింగదేశమును నాలము నందు జయించిమించి ని
స్తుల విలసత్ ప్రతాప బలశోభల చిమ్మగ; వచ్చె రాయలు
జ్వల రుచిరాంశు నీ భువన భాండము బ్రోచెడి శేషసాయినిన్
పొలయు ప్రసన్నవీక్షణ త్రిపుండ్రలలాటును చూడగోరుచున్.

3. మోహినీ రూపాన మురిపాలు కురిపించి
అమృతంబు పంచిన ఆదిదేవు
మధుకైటభాదుల వధియించి సురపాళి
విభవంబు నిల్పిన విశ్వవిభుని
పారిజాతంబుకై పాకారి నెదిరించి
పెకలించి తెచ్చిన ప్రేమమయుని
పాండవాఖ్యుల గీత భావించి గీతనే
బోధించినట్టి మేల్ పుణ్యపురుషు
ఆంధ్ర శ్రీ మహావిష్ణులై అందుమేటి
సర్వమంగళాకారుడే శాశ్వతుండు
కొలువుదీరిన గ్రామంబు, కొమరుమిగులు
ప్రథిత శ్రీకాకుళాఖ్యకున్ భక్తి తనర.

4. కలలో కన్పడి శ్రీరమా పతియె శ్రీకారం బిడన్జెప్ప, రా
యలు వ్రాసెన్, ఘను దివ్యభవ్య కథలత్యం తాను రక్తిన్ విని
ర్మల చిత్తాన ప్రబంధమున్, చతరతన్, రాణన్, వియద్గంగతు
ల్య లసత్బంధుర దీర్ఘ సంస్కృత పదన్యాసాయతంబై సము
జ్వల భావామృతపూరణ ధరణి వాసింపంగ నెక్కాలమున్.

5. అదియేగాదె ప్రసిద్ధమై తనరు కావ్యంబైన ఆముక్తమా
ల్యద, గోదాసతి భక్తిభావ లహరీ రమ్యంబునై, మాధ్వికిన్
సదృశంబై, భవముక్తిదమ్మునయి, భాషాయోషకున్ మాలయై
చదువక జిహ్వాకు స్వాదులై పరుగునే సంస్కారికైనన్ భళీ!

6. రాయలు సార్వభౌముడు, పరాజిత శాత్రవరాజితుండు, భ
ద్రాయతమూర్తి. అష్టకవిదంతుల పాలిటి కల్పకంబు, ఆ
మ్నాయ పథానువర్తి, మధుమంజుల భాషణ భూషితుండు, వి
చ్చేయు బుధోత్తమాళికి విశేషము కాన్కల నిచ్చుదాతయే.

7. ఆనృపు కోరమీసములె! అక్కట? కత్తులె కంటు పిండుకున్
దీనుల కిచ్చుధైర్యము, సతీనిచయమ్మున కిచ్చునెమ్మి, రా
జ్యానికి రక్ష, పాలితుల కార్తుల కిచ్చు సతంబు సౌఖ్యముల్
రాణికి పుల్కరింతలును రమ్యతరంబుగ కల్గజేయవే!

8. రాయలుగా కెవండు కవి రాజగు పెద్దన కాలుబట్టె యా
ప్యాయము తోనమర్చె గరు వంబున బంగరు గంగపెండెరం
బాయత భక్తియుక్తి, ననయంబును మేటికవుల్, రసజ్ఞులున్
వేయి విధాల మెచ్చుకొన - విద్దియకెంతటి వైభవమ్మహో!

# మాతృభాషనెపుడు మరువరాదు

- రాయప్రోలు వామనమూర్తి

898849830

అమ్మ భాషతెలుగు కమ్మగానుండును
పలుకు పలుకులోన నొలుకుతేనె
తెలుగు భాషమించు తీపిభాష కలదె
తెలుగు వార లార తెలుసుకొనుడు

అమ్మ, నాన్న అత్త యనెడి మాటలెపుడు
తెలుగుదనము నందు నొలుకుగాని
ఇతర భాష లందు యేది యా మధురిమ
తెలుగు వారలార తెలుసుకొనుడు

పోతనాది కవులు పోషించి తెలుగును
పద్యరచన చేసి పరిఢవిల్లె
వదలబుద్ధి కాదు చదివిన కొలదియు
తెలుగు వారలార తెలుసుకొనుడు

తేనె కన్న మిగుల తీపియైనదెకాక
పంచదార కన్న పనసతొనలు
కన్న, తెలుగుభాష మిన్నగునెప్పుడు
తెలుగు వార లార తెలుసుకొనుడు

అన్య భాషలందు అవధానప్రక్రియ
కలికమునకు కూడ కానరాదు

తెలుగు భాషయందె కలిగెనాభరణమై?
తెలుగు వార లార తెలుసుకొనుడు.

అక్షరములు మనకు యాబదారైనను
పుట్ట పదములెన్నొ పుష్కలముగ
పలుక పదము పదము నొలుకును దేనియల్
తెలుగు వార లార తెలుసు కొనుడు

అమ్మ, నాన్న, అత్త అన్నఅక్కయ్యయు
వదిన, బావ, కొడుకు వంటి వరుస
కనగమనకు తెలుపు అనుబంధమెప్పుడు
తెలుగు వార లార తెలుసుకొనుడు.

బ్రతుకు తెరువుకొరకు పరభాషలను నేర్వ
బట్ట, తిండినవియు పెట్టుగాని
మాతృభాష లగునె మనకవి యెపుడైన
తెలుగు వార లార తెలుసుకొనుడు.

# కృష్ణరాయలకు జోతలు

- డా॥ సర్వా సీతారామచిదంబర శాస్త్రి

సీ॥ ఏ రాజు భుజ శక్తి నృపతతికెల్లను
స్వప్నమందున గూడ భయముగొలిపె
ఏ రాజు వ్యూహంబు లెప్పుడు జూచిన
అల కృష్ణ నైపుణి నవగతించె
ఏ రాజు విజయాల నీరేడు జగములు
గొంతెత్తి నిరతమ్ము ఘోషలిడియె
ఏరాజు నిత్యదానైక విలాసంబు
లారూఢతరములై అవనివెలిగె
ఏ రాజు చిరకీర్తి ఇంద్రలోక స్త్రీల
వాగ్భూషణమ్ములై పదములందె
ఏ రాజు దృక్కులు ఇద్ధరాజనులకు
నతిశీతలమ్ములై హాయిగొలిపె
ఏ రాజు కవిరాజు లెల్లర బిలిపించి
కవితోత్సవమ్ముల కలిమిగూర్చె
ఏ రాజు హస్తాలు శారదాదేవికి
కావ్యసుమార్చనల్ కలుగజేసె
ఏ రాజు పాలన ఇమ్మహినంతట
స్వర్ణయుగమని ప్రశస్తికెక్కె
ఎవడు తుళువాన్వయమ్మున ఇంపుపెంప

పూజ్యనాగమ నరసరాట్పూజమునకు
సుతఫలమ్ముగ పుట్టెనో యతని ఆంధ్ర
భోజ బిరుదాంకితుని కడు పూజనీయు
సాహితీ సమరాంగణ సార్వభౌము
కృష్ణరాణ్మహీపాలుని కీర్తిసాంద్రు
ప్రస్తుతింతును పండితవర్యులార!

# “సాహితీ సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు”

- డా॥ పి.టి.జి.వి. రంగాచార్యులు

9440436557

1. సాహితీ పదమన హిత సహితమనుచు
హితము నెన్నంగ తనవారి వృద్ధికొఱకు
వారలెవరన్నచో తన ప్రజలెయనుచు
పండితులు చేత పలికించె ప్రభువతండు.

2. సమర మందున దూకంగ శంకలేదు
కత్తి చేబూని సుల్తాన్ల కందములను,
లేత సొరకాయగా కబళించి మించి
తల్లి ఋణముకు దీర్చిన తనయుడతడు.

3. అంగణమ్మున రత్నాల పొంగుజేసి
అమ్మినారట వీట పంతమ్ముతోడ
మోసమన్నది లేదుగా వీసమైన
అంచు పల్కిరి కృష్ణ రాజ్యమ్మునందు

4. సార్వభౌముడు హిందు రాజ్యాలకతడు
సార్వభౌముండు శత్రురాజ్యాలకతడు
సార్వభౌముండు కవులరాజ్యాలకతడు.

5. శ్రీకృష్ణదేవరాయలు
శ్రీకృష్ణునిలోని దుష్టశిక్షకుడిలలో
ఈకృష్ణానది సాక్షియు
మా కృష్ణాజనులు సాక్షి మహియును సాక్షే॥

# శ్రీ కృష్ణ లీలా తరంగాలు

- నేతేటి గణేశ్వరరావు

9490284342

సీ॥ శ్రీకృష్ణరాయలచే కత్తి కడిగించి
గంటమందించు సంస్కారమూర్తి!
నైలునదీతీర నాగరికతతోడ
జట్టు కట్టించిన సరసహృదయ!
రెడ్డి రాయలసీమ దొడ్డి గట్టిన కామ
ధేనువై సంపద లీనుతల్లి!
కనకదుర్గా మల్లికార్జున స్వాముల
పాదపూజల దనియు పావనాంగి!

ఆ॥వె॥ హిందు బౌద్ధ జైన యిస్లాము క్రైస్తవ
సంస్కృతులను నిల్పు సౌమ్యభావ
అమర రాజధాని యవతరించెడు వేది
కృష్ణవేణి! నీకు కేలు మోడ్తు.

సీ॥ నాగార్జునాచార్య నవబౌద్ధ తంత్రాల
రససిద్ధి నొందించు పసరునీది,
శ్రీనాథకవిరాజు సీసపద్యములందు
నడయాడు ఊయల నడకనీది,
ఆముక్త మాల్యద నర్ధ గాంభీర్యమ్ము

సంతరించిన ధీర సరళి నీది,
కూచిపూడిని నాట్యకోవిదు సిద్ధేంద్రు
నవరస భావనా నటననీది,
చెళ్ళపిళ్ళ, వారి శిష్యసంతతుల స
త్కవితాతరంగాల ఘనత నీది,

తే॥గీ॥ చిత్రసీమల, సంగీత, శిల్పకళల
దిగ్దిగంతాల వెలిగిన తెలుగు ప్రతిభ
నీదుచనుబాల మహిమచే నెగడెగాదె
కృష్ణవేణమ్మ నీ యిల్లె కృష్ణసీమ.

ఉ॥ బందరులడ్డువోలె మన బాసకు తీపులపూసలద్దు వా
రెందరొ! కృష్ణసీమను నుతించగ నెంతటివాడగాని, తా
డెందములోన బెట్టుకొని రీవివెలింగిన తెల్గుతల్లికిన్
వందనమేనొనర్తు నవవారిజపాణికి, కృష్ణవేణికిన్

మ॥ అలవైదేశికవాస కాంక్షలను నేడాంగ్లమ్ముపై మోజునన్
తెలుగున్నేర్వని యల్పబుద్ధుల నెటుల్ తీర్తెన్నులన్ దిద్దెదో
కొలువైయుండినగాకుళమ్మిరవుగా కొంగ్రొత్త మార్గమ్ములన్
విలువల్నిల్పవె “ఆంధ్రమేదినికి నీవే” విష్ణువైనన్ ప్రభూ!

చం॥ కలసినవేళ దుర్ముఖము కాలము నర్వదియేండ్లుసాగె, నం
చలగిన తమ్ముగుళ్లలకు, నాస్తులు పంచిన వేరెయుంచినన్
కలుపునుగాదె సంస్కృతి యుగాదులనుండి పరస్పరమ్ముమా
తెలుగుల ప్రేమబంధమిది తెంచిన బోవునె కృష్ణవాహినీ!

కం॥ చేలాంచలముల మాటున
పాలన్గొని పంచుకొనగ పరిపరివిధముల్
లాలూచుల బడు తెలుగుల
లాలించవె, కృష్ణవేణి! రంజితపాణీ!

శా॥ పద్యమ్మందలి ప్రీతిచే మదినియాశ్వాసాంత గద్యమ్ములన్
పద్యమ్మొప్ప రచించె రాయలిపుడీ ప్రాచుర్యమేమాయెనో?
సద్యోగంబెటులబ్బు సత్కవితకున్, సారస్వతస్రష్టకున్,
సద్యస్స్ఫూర్తినొసంగ కృష్ణవిభుడే జన్మించినన్ కృష్ణమా!

శా॥ శ్రీలాంగుల్యనదీతటమ్మున నవ శ్రీకాకుళంబున్న దా
కాళింగాంధ్రమునుండి వచ్చితిని, నీ కారుణ్య దృష్టుల్ పడన్
కేళీలోలతరంగ రమ్యమగు నీ కృష్ణస్థ శ్రీకాకుళం
బాలోకింపగ, నాంధ్రవిష్ణుడవు నన్నాశీర్వదించు ప్రభూ!

# ఆముక్త మాల్యదీయము

- తుమ్మోజు రామలక్ష్మణాచార్యులు
9703776650

1. గీర్వాణంబున హర్షనైషధమనన్ కేల్మోడ్చి కీర్తింతు రాః
గైర్వాణీ పదబంధురంపు తెలుగున్ గీర్వాణ కావ్యంబునా
నుర్విన్ ఖ్యాతిని బొందె రాయల హృదబ్జోద్భూత మాముక్తము
న్నుర్వీజాతమునై చెలంగె నిల గోదోద్వాహ కావ్యమ్మునై

2. కలయం జూచిన నేలబావులవి నిక్కాలాన లేవెయ్యెడన్
భళిరా! బావులలోని చేపలను సొంపారంగ పిట్టల్ హళా
హళిచే ముక్కున బట్టి పైకెగురుటాహా! రథ్యలన్ బంతులా
టలుగా యౌవత క్రీడలై కనుల గట్టం జెప్పె రాయండహో!

3. గురుగుంజెంచలి కూరలున్ మెసలినన్ కూర్చున్ గదారోగ్యమున్
తటికిన్ యోగ్యపుటోగిరంపు తనువుత్సాహంబు సత్యంబునౌ
మరి చెంగల్వలు డిగ్గియల్ విరియు మాణిక్యరత్నద్యుతిన్
పరికించందగు కృష్ణరాయ రచనా ప్రాథమ్య పారీణతల్.

4. కానన్ రారిల రాజకీయములలో ఖాండిక్య కేశిధ్వజుల్
కానన్ రావిల రాజమార్గములలో క్రమంపు వృక్షాళికన్
కానన్ రాదొక తెల్గుపద్యమిక వాక్కాలుష్య మేపారుటన్
కానన్ రావయ కృష్ణరాయడిటు లిక్కాలాన కుత్తేజమై.

5. కవితల్ పూతలు క్రొత్తలై యడుగులన్ ఘల్ ఘల్లునన్ వేయుచున్
చవులూరించు పదాలె పాదములు సంబారించు భావమ్ములన్
భవమై హైకులు నానులున్ మినులు సల్లాపంపు కావ్యమ్ములై
హవళించెన్ గద కృష్ణరాయ యిపుడూహల్ పోహళింపగహో!

# దేశబాషలందు తెలుగె లెస్స!

- టేకుమళ్ళ వెంకటప్పయ్య

9490400858

1.తే.గీ. దివ్య శ్రీకాకుళమ్మున తిరిగి తిరిగి
కృష్ణవేణి తటమ్మున కేను జేరి
అర్ఘ్య మీయంగ దలచితి అర్కునకును
నీరు దోయిలి జేగొని నిలిచినా!

2.తే.గీ. తెలుగు తెలుగని తపియించు తేజమయుడు
ఆంధ్రభోజుని యరచేతు లందు గంటి
బాష్ప జలమును గార్పుచు బాధనంది
తీవ్ర యావేదనమ్మున తేరి జూచి
అయ్యలారా! ఆ కృష్ణదేవరాయలు నాతో ఇలా అన్నాడు.

3. తే.గీ. సకల భాషల యందున సాటిలేని
తేనెలొలికెడి తెలుగును తెలివి మీరి
మరచిపోయిన జనులన మనసు గుండె!
గతపు వైభవ మంతయు కండ్ల తిరిగె!

4.ఉ. నన్నయ తిక్కనాదులును నాచనసోమన యెఱ్ఱనాదులున్
చెన్నలరార పోతనయు శేముషి గాంచిన పెద్దనాదులున్
ఎన్నగ నన్నె చోడుడును ఏలిక రాయలు సూరనాదులున్
అన్నుల మిన్న మొల్లయును హాస్యపు శ్రేష్ఠుడు రామకృష్ణుడున్

5. ఉ. ఎందరు ఎందరో కవులు ఏర్పడ జేసిరి కావ్య వృక్షముల్!
విందులు జేయుచుంటిమిల వేడుక మీరగ తత్ఫలంబులన్
పొందిక గాను యాంధ్రులటు పొందిరి కావ్యరసానుభూతులన్
గ్రంధములన్నియున్ మిగుల గౌరవ కారణమాంధ్ర జాతికిన్

6. ఆ.వె. ఆంగ్ల భాష యనుచు అఱ్రులు జాచేటి
తల్లిదండ్రులార! తగదు మీకు
మాతృభాష యన్న మమకారమేలేక
తెలుగువారమనుచు తిరుగుచుండ్రు!

7. తెల్ల దొరలు మెచ్చె తెలుగును కీర్తించె
నల్ల దొరలకేల నచ్చలేదొ
జనని జన్మ భూమి జాతికి గర్వంబు
దేశ భాషలందు తెలుగె లెస్స!

# సప్త రత్నమాలిక

- నడకుర్తి స్వరూపరాణి

9885557118

1.సీ॥ శ్రీకాకుళంబన ఆకాశహర్మ్యమై
గ్రామాల మిన్నయై గ్రాలె సుమ్ము
మూడు వేలేండ్లకు మున్నె తెలుగుజాతి
రాజ్యానికొదిగిన రాజధాని
విజయవాడకు శిరోవేష్టనమైపారుం
కృష్ణా తరంగిణి క్రేవనొప్పు
కృష్ణా నదీతీర హృద్యప్రాంగణమున
దివిసీమ వెలసిన భువిలలామ

తే.గీ. భూపుడాంధ్ర మహావిష్ణుడా పురాన
తీర్చెనాంధ్ర మహావిష్ణుదేవళంబు
తనదు పేరుపై: నేటికీ తనరు తెల్గు
కీర్తి కెత్తిన ఉజ్వల కేతనముగ

2.తే.గీ. ఆంధ్ర విష్ణు రాడ్రచయిత సాంద్ర తెల్గు -
జాతి సంస్కృతి చిత్రణ చంద్రికలకు
"కాణ్వ" నామ ప్రత్యేక వ్యాకరణ కర్త
అలరె "సిరికా కొలని నాథుడను" యశమున

3.తే.గీ. ఆంధ్రభోజుడు శ్రీకాకుళాంధ్ర దేవు
దేవళాన కూరికియు యాదృచ్ఛికముగ
లెస్సయౌ తెల్గులో కావ్య లేఖనమును
దీప్తి స్వప్నించి క్షేత్రపతిదిగ నెంచె.

4.తే.గీ. కాంచిన కలకు స్పందించి లాంఛనముగ
ఘంట మూనెను ఆలయ మంటపమున
కావ్య "మాముక్త మాల్యద" కాగ నెదలు
మారె ఆముక్త మాల్యదమంటపముగ

5.తే.గీ. ఘంటమా ఖడ్గమా అది కరతలాన
రవ్వలెగయ గరగరల్ రయ్యి మనగ
సాహితీ సమరాంగణ సమవిహార
ధిషణ సంధాయ, శ్రీకృష్ణ దేవరాయ

6.తే.గీ. ఆంధ్ర విష్ణువు గుడికి రాయలప్రతిమను
అభినవైతి హ్యమునకు మారాకుహత్తె
"మండలి" సదన్వ యాబ్ధీందు మండలంబ
నయ విధేయ "బుద్ధప్రసాద్" నామధేయ

# गीर्वाणान्ध्रप्रशस्तिः

- ఉపద్రష్ట వేంకటరమణ
98444906

*पठामि संस्कृतं नित्यं वदामि संस्कृतं सदा ध्यायामि संस्कृतं सम्यक् वन्दे संस्कृतमातरम्*
*वन्दे भारतमातरम्*
*भारतेन समो देशः ब्रह्माण्डे नास्ति करवन।*
*संस्कृतेन समा भाषा न भूता न भविष्यति ॥*

1. *श्रीकाकुलं प्राप्य स कृष्णरायः*
*जेतुं कलिडान् समुपास्य विष्णुम् ।*
*पुपोष्य शत्रौ हरिवासरे मुदा*
*निमीलितः स्वप्नगतं एकादसी ददर्श ॥*
2. *स्वयमान्ध्रमहाविष्णु :*
*कृष्णरायं समादिशत् ।*
*गीर्वाणकृतिकर्ता त्वं*
*त्रैलिडीमपि भूषय ॥*
3. *श्रीरडेशदयापात्रीं*
*गोदां संस्तूयतामुना ।*
*महाप्रबंधनिर्मात्रा*
*गैर्वाणी अभिधा कृता ॥*
4. *तदेतत्तस्य नैपुष्यं*
*कृष्णरायकनेर्जना : ।*
*स्फुटमत्र निवेध्याध्य*
*धन्योस्मीति सुनिर्भरः ॥*
*(धन्य सुनिर्भरः अस्मि इति)*

# మాతృభాష

- విద్వాన్ డా.మూలె రామమునిరెడ్డి

1.ఆ॥వె॥కదళి ఫలము కన్న ఖర్జురంబులకన్న
మధురమైనదన్న మాతృభాష
దేశభాషలందు తెలుగు లెస్సైనను
మరతువెందు కోయి మాతృభాష.

2.ఆ॥వె॥పక్షిజాతి పలికె పక్షుల భాషనే
పసులు నేర్చి చూడు పసుల బాస
తెలుగువాడు మరచె తేనెలూరెడు భాష
ఇంతకన్న వింత యిలను గలదె?

3.ఆ॥వె॥అమ్మ భాషయందు అమృతంబు చిందగ
ఆదరింపరేల యన్నలార!
మనుజులందు మమత లినుమడింపగఁజేయు
భావరసము లొలుకు జీవభాష

4.ఆ॥వె॥మరచి పోదమన్న మరుపలేనట్టిది
తెలుగు నుడుల తీపి తేనె తీపి
తెలుగు దనమె కాదు తేజంబు సైతము
విశ్వమంత చాటు విమల భాష

5.సీ॥ ఏభాష అమరంబొ యేభాషమధురంబొ
భారతాదులువెల్గె భాగ్యగరిమ,

ఏ భాష ఆంధ్రుల నేక తాటను నిల్పి
పండించి సాహితీ ప్రాంగణమున
ఏ భాష తనలోన నెన్నెన్ని ప్రక్రియల్
వెలుగొందజేసెనో వేయిగతుల.

6. ఆ॥వె॥ మాతృమూర్తులార! మనమాతృభాషకు
తీర్చి నేర్పుతోడ దిద్ద వలయు
కష్టకాలమొచ్చె కమ్మని భాషకు
కంకణమ్ముగట్టి కావలవలయు

7. సీ॥ దేశభాషల యందు తెలుగు లెస్సని వాటి
తులలేని కీర్తిని వెలయజేసె
సాహితీ సమరాన సార్వభౌముండవై
సత్కవీశ్వరులను సత్కరించి,
ఆముక్త మాల్యద నవలీల రచియించి
బహుముఖ ప్రజ్ఞలను బరిమళించి
దేశ దేశములందు దెలుగుల కీర్తులన్
తేజరిల్లగఁజేసె ధీరమూర్తి
నీదు శౌర్యముమాలోన పాదుకొనగ
నీదు ధైర్యమ్ము మాయందు నెగడు నటుల
నీదు త్యాగమ్ము మాలోన నెలకొనంగ
కృపను జూడుమో మాయన్న కృష్ణరాయ!

8. ఆ॥వె॥ సంప్రదాయములను జగతిని జాటెడు
సాటిలేని భాష సరస భాష
తెలుగు జాతి కీర్తిఁదీపింపఁజేసెడు
దివ్యమైన భాష – తెలుగు భాష

# స్వాగతమ్ము

- డా॥ పన్యారం సాంబశివరావు

కం. పలు జయములు, పలు శుభములు
పలుపథములు, పరవశములు, పలు మంగళముల్,
పలుముదములు మిముజేరెడి
ఫలములనిడు రెండువేల పదిహేడు ధృతిన్.

ఆ॥వె ఉదయ కాంతులిచ్చు ఓ నూతన ఉగాది!
పంచిపెట్టవమ్మ మంచిబతుకు
దురితములను కూల్చు 'దుర్ముఖ' నామాబ్ద!
స్వాగతమ్ము నీకు స్వాగతమ్ము.

ఆ॥వె తెలుగదేల యన్న దేశమేదైనను
తెలుగువాడ నేను; తెలుగదేల
యన్న విశ్వభాషలందు తెలుగులెస్స
పరమ సత్యమిదియె తరచిచూడ

# శ్రీకాకుళ కవితాకళ

- శ్రీమాన్ కోగంటి వేంకటాచార్యులు

9849859348

1. ఇదియే శ్రీకాకుళమి
యద్దియే దివ్యతిరుపతిగ నలరారెదు, ని
య్యది రాయల దివ్యానం
దదమయి 'యాముక్తమాల్యదను ప్రసవించెన్.

2. తెలుగుఁరాయని ముద్దులొలుకు కబ్బమ్మున
కిచటనే తొలిపల్కు లింపుమీఱె!
తను కాసులపురుషోత్తమునిచే నూఱుప
ద్దెమ్ములఁబలికించెఁదేనెలూఱ
కైతల కాణాచియై తేటతెల్లమౌ
తెలుఁగుల పలుకులజిలుగులూదె;
తెలుఁగులవేల్పుకాకుళరాయడౌ తండ్రి
నిచ్చలుఁగాపాడు నేర్పుకాఁడు
కానవీనిని చేరిమ్రొక్కంగ నితఁడు
జాలిపేగులవాఁడింక సాకుకొనఁడె?
యిట్టి కాకుళమందె మీరేమడిగిన
నిచ్చివిడనాఁడఁడీ వట్టిపిచ్చితండ్రి

3. అందఱముఁగూడి యిచ్చటి
'యాంధ్రభోజ-
రాజునకు మంగళముసల్ప

రందు; పూర్వ-

పుణ్యముల పంటగాదె

యీ పూటమనకు?

మూరురాయర గండని

మ్రొక్కి నిలువ!!

4. శ్రీరస్తు! శుభమస్తు! శ్రీయశోఽస్తు! సదావి

జయ పూర్ణ కవితా ప్రశస్తి రస్తు!

కనకధారాస్తు! సద్గానామృతాప్తిర !

స్త్వగణితధనమస్తు! హాళిరస్తు!

సత్యమస్తు! మహోఽస్తు! సకల భూమండల

వాల్లభ్యమస్తు! సుస్వాస్థమస్తు!

ప్రాణిషు నిత్య సద్భావనా! "స్వాంధవి"

ష్ణుబ్జ పాదాకుంఠ భక్తిరస్తు!

మంగళతరంగ సంగత మధురిమాస్తు!

సకల పండితాశీఃప్రభావ కవితేద్ధ-

సిద్ధిర! 'స్వాంధ్ర భోజ' ప్రసిద్ధిరస్తు!

తే; సుకవిగేయ! శ్రీకృష్ణ దేవరాయ!!

# అహో ఆంధ్రభోజా!

- హెచ్.ఆర్.చంద్రం
9493248053
08674-246053

శ్రీకృష్ణదేవరాయా!
నీకు నమస్కారమయ్య! నీసరి ప్రభువుల్
లోకాన నెంద రుందురు?
ప్రాకటముగ ప్రజలు మెచ్చు ప్రభు వీవయ్యా!

తెలుగు ప్రజల నేలి, తెలుగు బాసను నేర్చి
తెలుగులోన కృతిని వెలయజేసి,
తెలుగు కవుల బ్రోచి, తెలుగు లెస్సని పల్కి
'ఆంధ్రభోజ' బిరుద మందినావు!

నీవు చేసినట్టి సేవ తెలుగుభాష
కెవరు చేసిరయ్య? ఇప్పటికిని
నిన్ను మరవజాలకున్నాము, ముందును
తలచుచుందుము నిను తప్పకుండ!

కాని, ఒక్కమాట కాదనలేమయ్య!
మాతృభాషయన్న మాకు వెగటు!
వర్తమానకాల వైపరీత్యము వల్ల
నిట్టి చెట్టపుట్టె! నేలచెపుదు?

దేశభాషలందు తెలుగు లెస్సను మాట
పైకి చెప్పుకొనుట వరకె! మాకు
తెలుగు నచ్చకుండె త్రికరణ శుద్ధిగా!
మరచుచుండినాము మాతృభాష!

ఐన, నిన్ను మాత్ర మత్యాదరమ్మున
తలచుచుందురయ్య తెలుగువారు;
నీవు చేసినట్టి సేవసామాన్యమా?
అది క్షరమ్ము కాని, దక్షరమ్ము!

## శ్రీ కొలను భారతీ నమస్తుభ్యం

## అలరనీ తెల్గు శ్రీకాకుళాంధ్రదేవ

- వెలమర్తి రమణయ్య

సీ॥ విరితేనె గ్రోలిన విరితేనె మేపరి-మదినెంత ఆనందమందగలదొ
లేసజ్జ కంకుల లెస్సగా మెక్కిన - పసులకాపరి రుచిపక్వమేదొ
కొఱ్ఱన్న మందున గోగాకు పచ్చడి - కలిపి తినిన యెంతకమ్మదనమొ
లేత కొబ్బరిముక్కతీత గడ్డలదిన్న - నోట గల్గెడి చవిసాటియేదొ

తే.గీ॥ అటులయింపారు సొంపారు ఆంధ్రభాష - 'అమ్మనాన్న' పిలుపులే
అరుదుఅయ్యె
ఆంధ్రభాషామృతముగ్రోల అఖిల జగతి, అలర నీతెల్గు
శ్రీకాకుళాంధ్రదేవ!

సీ॥ భీముని కోపమ్ము భీషణాకృతి జూప - జ్వాలయైనటు
పదజాలమొప్ప
శాంతనవుని పల్కు సాంత్వన మునుగూర్చు -
సందేశమునొసగశాంతమొప్ప
వ్యాఘ్రమ్మునకు జిక్కి ప్రాధేయపడునెడ -
ఆవువినతికరుణార్ద్రమంద
నవరసమ్ముల నొల్క చెవులకు కదుయింపు - సంగీత
మైదోచుసడులనుడుల

తే.గీ॥ భాష తెలియని వారెసెబాసనంగ - అమరవాహినిబోలు
ప్రవాహమనగ

కథల గేయాలపద్యాల కావ్యసరళి - బెలగు మాతెల్గు భాషకే చెదలు పుట్టె
ఆంధ్రభాషా మృతము గ్రోల అఖిలజగతి అలర తెల్గు శ్రీకాకుళాంధ్ర దేవ!

సీ॥ కాల్చేయుచున్నారు కాలెత్తవేయంచు - సతిబిల్చుపతిభాష సంకరమ్ము
వడ్డించు వారితో వైట్రెసు పెట్టండి! అన్న అతిథికేక అర్వుతెలుగు
మనసులో బాధను మాటలోతెలుపగ - ఫీలింగనుచు ఆంగ్ల సీలదేమొ
అమ్మ! ఆకలనక హంగ్రిగా ఉందంచు బాలలనోట అప్రాచ్యవయ్యో
ఆంటి! సంబోధన అత్తకూపిన్నికి - ముడివెట్టి సంస్కృతిమురికి అయ్యో
మమిత్రి నుచుబిల్చి అమ్మనేశవమన్న - వ్యవహారమే తెల్గు పడవ ముంచె

గీ॥ మజ్జిగను తెమ్మనిన మాట మాలియవని - దుస్థితికి కారణమగు
అవస్థబాయ
మంచినీళిమ్మని పదమర్థమవని - దుర్గతికి మూలమౌస్థితొలగజేయ
కలుగజేయుమ తెలుగుపై గౌరవమ్ము -
ఆంధ్రభాషామృతముగ్రోల అఖిలజనులు ప్రబల నీతెల్గు
శ్రీకాకుళాంధ్రదేవ

సీ॥ ఆంధ్రమహా భారతమ్మును నన్నయ్య - రచియింప గోరెనా రాజరాజు
ఆంధ్రభాగవతము వ్రాయించె పోతనకవిరాజు చేత, యిక్ష్వాకు నృపతి
శ్రీనాథకవిరాజ శృంగార నైషధ కృతివేమ నృపతి వినతిమహిమయె
మనుచరిత్రను వ్రాయుమని అల్లసానిని - రాయలేకోరెను రమ్యకీర్తి
తే.గీ॥ లలనలైపూల జల్లిన లతలవోలె - మధుర మందార మకరంద సుధలవోలె
సురనదీజల కణములన్ చుక్కలవలె - శాంతరసమొల్కు
బ్రహ్మతేజంబువోలె
మరులసిరులుగవలపుల మాలికలుగ - వరలె వరభాష
మనతెల్గుతరతరాల

# తెలుగు వెలుగులు

- డాక్టర్ జంధ్యాల పరదేశిబాబు

పద్యమై గద్యమై పాటయై వర్ధిల్లి
త్రిపథగామిని నాదు తెలుగుకవిత;
మాధుర్య ధుర్యమై మహితమై విలసిల్లు
తీయందనమ్ముల తెలుగుకవిత;
భవ్యమై సుజన సంభావ్యమై యెప్పారు
తేటతేనియబోలు తెలుగుకవిత;
హృద్యమై రసికసంవేద్యమై భాసించు
వెలుగు జిల్గుల తోడ తెలుగుకవిత;
తెలుగు నాటను పుట్టుటే కలిమి నాకు,
తెలుగుజాతిని పుట్టుటే బలము నాకు,
తెలుగుమాటను పల్కుటే దీప్తి నాకు,
తెలుగు కవినౌట నాపుణ్యఫలము గాదె!!

# పవిత్రసంగమం

- కె. గౌరినాయుడు
9652521177

**మా గోదావరీ ప్రశంస!**

నాసికాత్ర్యంబక నటరాజుపొంతన
భువిని కాలిడిన యీ దివిజగంగ
భద్రాద్రిరామన్న పాదయుగళి తాకి
పాపాలు బోద్రోచు పావనఝరి
దండకారణ్యాల కొండభూములగూడ
చిగురింపజేసెడు జీవమురళి
ఒడ్డులొరసిపారి వొయ్యరములువోయి
గలగలసడిసేయు అలల కదలి

అల మహారాష్ట్ర, తెలంగాణమాంధ్రదేశ
సస్యవృద్ధికి సాహిత్య సంస్కృతులకు
నెలవుగా నెల్లప్రాణుల నిలుపునట్టి
పూతచరిత! గోదావరిమాత గొల్తు.

శ్రీలం గురిసెడు కృష్ణా
కూలంకషగొల్తు అలలకోలాహమ్మున్
కాళింది బోలు తోయము
పాలించునుగాదె పాడిపంటలకలిమిన్.

సహ్యపర్వతాల సానువులంబుట్టి
భీమ తుంగభద్ర సామమొంది

కాకుళమ్ము దాటి కదళీపుంమ్ము లో
ఉత్తరించి సాగెనుదధి కృష్ణ !

**కృష్ణరాయ ప్రశంస!**

అలహంపీనగరమ్ము వెల్వెడలి కృష్ణా తీరముంజేరి, దో
ర్బల మొప్పంగ కళింగ గెల్వగల సాలంకార వాంఛారతిన్
కలగాంచెన్ తెలవారు జామున మహాకావ్యమ్ము నిర్మింపగా
తెలుగుం భాషయె లెస్సయంచు తెలిపెన్ దివ్యాంధ్ర విష్ణుండహో!
ఇల నీకెవ్వరు సాటిలేరు గద తండ్రీ కృష్ణరాయప్రభో!
దేశభాషలందు తెలుగు లెస్సని తాను
చెప్ప, వాసనమయి చెల్లెభువిని
నాల్గుబాసలాడి నాణెమ్మురూపించి
చక్కజేసె కృష్ణ చక్రవర్తి.

**అంతట తెలుగులు :-**

సంగీత సాహిత్యసాము గరిడీలలో గడిదేరి తృప్తియై గడపినారు
రతనాల భాగ్యాలు రాసులుగాపోసి సంచితమ్ములనుభవించినారు
భావించి రాసిక్యపారమ్యభక్తులు దోసిళ్ళతనివార దూగినారు
ఇరుగుపొరుగుతోడి ఎనలేని నెయ్యమున్ మరుపుమలగకుండ మసలినారు

తెలుగు ప్రజలెల్ల నీవల్ల తెగువమిగిలి
భయములేకుండనెత్తిరి జయ పతాక
సాహితీ సమరాంగణ సార్వభౌమ!
కృష్ణరాయ! సాక్షాదాంధ్ర విష్ణురూప!

## తెలుగుభాష

- ఎమ్. సీతారామమ్మ

9299303035

శ్రీలు చిందెడి కళ్యాణసీమమనది
మధుర మధురత్వమును నింపు భాషమనది
జన్మ జన్మాల పుణ్యాన జనన మంది
బ్రతుకు చుంటిమి తెలుగులో మాటలాడ

ఆంధ్రనాయకుండగును ఆంధ్రమహావిభుడైనవిష్ణువే
సాంద్రసుపాలనంబునను సాగెను దేవుని వోలెయీధరన్
ఆంధ్రజనాళి మెచ్చెనుగ, నాతని నిల్పెను దేవళంబులో
చంద్రిక పంచుచుండెనుగ శాశ్వత రక్షకుడౌచు విష్ణువై

రాయల పాలనంబునను రంజిలెశారద కావ్యరూపియై
రాయల పాలనంలోనను రమ్యతగాంచెను లాస్యరూపియై
రాయల పాలనంబునను రాజ్య ప్రజల్ సుఖమందె తృప్తులై
రాయలు కావ్యకర్తమయి, రాతికి రాగమునేర్పె శిల్పియై
నన్నయ యుగమున నడుమును బిగియించి
          నడకలు సాగించె నాందిగాను
తిక్కనకాలాన తీరైన సొగసులు
          నేర్చెను చక్కగా నిత్యమయ్యె
ఎఱ్ఱనవేళను ఎంతొపేరును పొందె
          చలువ పందిళ్ళను సాగెనపుడు
శ్రీనాథు సమయాన శృంగారభక్తులన్

చాటించెలోకాన జయముపొందె
రాయలసభలోన రమణీయతనుజూపె
పల్లకినూరేగె పరవశముగ
నాయకరాజుల నట్టింట నడయాడి
నాట్యశృంగారాల నటనచూపె

వివిధకాలాల నడయాడి వివిధగతుల
చేరెనిప్పుడు నవయుగ సీమలోకి
వేయి ప్రక్రియల్ పెరుగంగ వెలుగుపంచి
తెలుగు భాషావధూటియె నేటి వరకు
తీయనతేనె వాకయగు తీరగు పల్కులు చిందులేయగా
నెయ్యముగూర్చు వెన్నెలయి నిత్యముమోదముగూర్చుగాదె, ఏ
కయ్యమునైన మాన్పి మమకారము చూపెడు సర్వకాలమున్
ఉయ్యాల లూపుచందమున ఓయనకుందురె విన్నవారలున్.

గలగల ప్రవహించు గంగోత్రి మనభాష
పరుగులడెడి కృష్ణపలకరింపె
పెన్న తుంగభద్రల ప్రేమయె మనభాష
కుంతల జలపాత కూర్మినుండు
ఒగ్గు పాటలలోను ఒదిగేటి మనభాష
కురవంజి పాటల కులుకుభాష
బుర్రకథలలోన బోధించు శౌర్యమ్ము
తోలు బొమ్మలతోటె దోచుమదిని

పూను తలపైన వయ్యారి పూలవోలె
పల్లెపదచుల జడగంట, వల్లెవోలె
దుక్కిటెద్దులమెడగంట ఫక్కివోలె
పదుచుపిల్లల పారాణి పదమువోలె
హాయి కలిగించు మనభాష యనవరతము

# సహస్ర వసంతాల తెలుగు పద్యం

- అమ్మా అంజారావు

9505860698

ఉదయపు వెల్గులో నుసురులూదిన యూహల సోయగానివో
ముదమును మూటకట్టు నవమోహినివో, ములుసూపుపద్యమా!
ఎదనుదయించు వేడ్క నినునెంచ సహస్రవసంత వాటికన్
పదపది కావ్యకోకిలలు పల్కును నీకు శుభంబు లెంచుచున్.

తెలుగున శోభనీవు, తొలితీర్థము నీవు, యశోవిజేతవున్
తెలతెలవారు ముందటె సతీర్థులగూడి భుజించుచుంద్రు నిన్
తెలుగుల భాగ్యమీవు, నవతేజము నీవు, తెలుంగు పద్యమా!
పలుకుల మేల్పసిండి వటె, పల్లవితాంతర కోమలాక్షరీ!

మందార మకరంద మాధుర్యమునదేలు
ముంజేతి చిలుకల మూలమీవు,
నవ ప్రబంధ కవితా నాగరికుల గన్న
సురుచిర భాషల సుందరీవు,
కొలువు కొలువునందు కోటిరీతుల నొప్పు
నభ్యుపగమ కవితాభ్యుదయవు
ఋషి కృషీవల కవి ఋుక్కులకెక్కిన
గీర్వాణిరాణి నా గీతమీవు

కాలగతుల మారినగాని కలికి కథన
రూపు మారని సొగసుల ప్రాపునీవు,

పద్యమా! నడయు నా ప్రణవనాదము నీవు
ప్రాణమున్నది నీలోనె పసదనమ్ము

అలరాణ్మహేంద్రవరాఖ్య పట్టణమున
తెలియ చాళుక్యుల చెలియవీవు
నెల్లూరు సీమలో నెలకొన్న యతివేణి
తల్లి సంస్కృతమాంధ్ర తనయవీవు
విజయనగరులోన విశ్వతోముఖమైన
విపులార్థ సంచిత వెలుగువీవు,
కృష్ణరాయల కోట కొలువులో నడయాడు
జెట్టిప్రబంధాల పట్టివీవు,
తింటె గారెలు తినవలె, వింటె భార
తమ్ము వినవలె నని బల్కు తబిసివీవు
ప్రత్యయాంత రూపములాది భవ్యభాష
యాంధ్రమనగ పద్యోద్గతి కమ్మవీవు

కలికి కామనిపద్యమా! కల్లడిదరి
కాకలీకలకంఠము కవిగొనంగ
గోస్తనీ జలధారల గుణము మించ
రాజరాజ నరేంద్రుని రాణివైతి.

# రాయల యుగం

- డా॥ పూసల రజనీగంగాధర్

9290680605

సీ॥ రాయలేలు కతన రాళ్ళసీమయె నాడు - రతనాల సీమగా రశ్మిజెందె!

రాయలేలు కతన రాష్ట్రమందలి తెన్గు - తీయతేనియకన్న

తీయనయ్యె!

రాయలేలు కతన రాశులు రాశులై - కవన సంపదనేడు

కదనుద్రొక్కె !

రాయలేలు కతన రమ్యమౌ శృంగార - రసము జీవన

రసరాజమయ్యె!

ఆ॥వె॥ రాయలేలు కతన రాళ్ళు శిల్పములయ్యె - కటికరాళ్ళునుసరిగమలుపాడె!

రాయలేలు కతన ప్రజలె ప్రభువులయ్యె ! - బక్కరైతు,

రాజునొక్కటయ్యె!

సీ॥ మనుచరిత్ర కథను మణికంకణంబుగా - వసుచరిత్రను శిరో

వజ్రముగను

పారిజాతంబును భూరి వాల్జడకున్న - బంగరు మేల్మి

యాభరణముగను

అదె కళాపూర్ణోదయంబు నడుమున చ - ట్రంబుగా జుట్టు

వడ్డాణముగను

పాండురంగ కథను ఫాలభాగంబునన్ - తీర్చిదిద్దినయట్టి

తిలకముగను

గీ॥మా॥ అరయ నాముక్తమాల్యద హారమిచ్చి - చదువులమ్మను తీర్చిన
సవ్యసాచి!
జెట్టికత్తిని, కలమును బట్టినట్టి - సాహితీ సమరాంగణ సార్వభౌము
దతడు రాయలు రాయలే! అదియ నిజము !

సీ॥ ఎల్లిన కలమున యేటి యూటగ బుట్టి - శ్రీనాథ కవిచేత చెలగి, నదిగ
ప్రబల సంద్రంబయి ప్రాబంధ యుగముగా - అలరారె గాదె? రాయల యుగంబు!
పండ్లు కాయలవోలె వజ్రాలు గొనెనట - వింతగా అంగడి వీథిలోన !
స్వర్ణ రాశులతోడ స్వర్ణ యుగంబుగా - అలరారె గాదె? రాయల యుగంబు!

తే॥గీ॥ యుగ యుగంబులకైన నేయుగమునైన - నిట్టి యుగమింక
వచ్చునొ? యెట్టులౌనొ?
రాయలవలె మేల్కవిరాజు, రాజు లేడు! - రాయల యుగమోలె
యుగంబు రాదు రాదు !

సీ॥ మంత్రి తిమ్మరుసును మహనీయునిగ నెంచి - అప్పాజియని బిల్చు అనఘుడితడు !
కవియల్లసానికి గండపెండేరంబు - కాలికి తొడిగిన ఘనుడితండు !
కృతికర్తయేగాక కృభర్తయై పలు - కవులను పోషించు కరుణశీలి !
చెలియతో సరసాన చెరిసగ పద్యంబు - రక్తిగా జెప్పిన రసిక శీలి !

తే॥గీ॥ అగ్రహారముల నొసగి అష్ట దిగ్గ - జముల నాదరించిన ఘనచక్రవర్తి !
పారమెరుగని యా విష్ణుభక్తి యందు - వసుధ సాటియే లేనట్టి వైష్ణవుండు !

సీ॥ క్రీడలు సాహితీ క్రీడలు సరస వి - నోదిని, నాట్యాలు మోదమలర !
భువన విజయమున భూ నభోంతరములు - పిక్కటిల్లగ దిక్కు దిక్కు లెగయ !
కన్య నుండియు కడ కటకమునకు త్రిస - ముద్ర పాలకుడంచు ముద్రగొనుచు
శాత్రవులకు సింహస్వప్నమై నిలిచెను - జయకేతనం బాకసాన నెగుర !

ఆ॥వె॥ విజయ దశమినాడు వేడుక లొకవంక - యుద్ధ యత్నక్రియలు నొక్కవంక
రాజసముగ నుండె రాయల రాజ్యంబు - రామరాజ్యమదియె ప్రాజ్ఞులార!

# అమృతముకన్న మిన్నయౌనాంధ్ర భాష

- డాక్టర్ తూములూరు శ్రీ దక్షిణామూర్తి

మాతృదేశాభిమానంబు మనుగడనిడు
మాతృభాషాభిమానంబు మన్ననలిడు
అమృతమునకన్న మిన్నయౌనాంధ్రభాష
అనుభవమ్మున నానంద మధికమగును.

శుభములజల్లు రంగవిభుసుందరిగూర్చిన పెండ్లి ముచ్చటల్
సభలనుతింపగాఁదగిన సత్కవిశేఖరు కృష్ణరాయడన్
ప్రభువును తెల్గులో వెలయవ్రాయుమటంచును ప్రోత్సహించిత
ద్విభవము చాటిచెప్పెనిటవిష్ణువు సత్కృతి గాదె భాషకున్;

శ్రీమంతుడవు నౌవాకండవన లక్ష్మీదేవి నిన్గొల్చెదున్
ధీమంతుడవు శౌర్యశాలివని కీర్తించున్శ్రుతుల్ యోగమున్
క్షేమంబేర్పడ భక్తులన్ గరుణ రక్షింపన్ సమర్థుండవీ
వే, మాదిక్కని నమ్మనానెదను స్వామీ! మమ్ము వీక్షింపవే;

# చిరస్మరణీయ! శ్రీ కృష్ణరాయ !

- పొన్నపల్లి వెంకట కృష్ణయ్య

మధ్యాకరలు

వైరిరాట్సైనికేభముల స్వప్నపంచాస్యమై వేచి
పోరులెన్నియొ సల్పిగెల్చి భూరి సామ్రాజ్యనాథుని గ
మేరూన్నత ఖ్యాతిగాంచి మితిలేని వైభవం బంది
శిరాననుడ వైతివయ్య ! శ్రీ కృష్ణదేవరాయ!

నీ రణ వ్యూహపాటవము, నీ పరాక్రమ సాహసములు,
నీ రమ్య రాజ్యపాలనము, నీ కవీంద్ర సమాదరణము,
నీ రసజ్ఞత, కళాసక్తి, నీ రాజసము నొక్కయెత్తు
నీ రసనాగ్రానవాణి నిల్చి సల్కించుటొక్కెత్తు.

ఒక వంక సమరాంగణంబు లొకవంక రాజ్యపాలనము
నొకవంక నృత్యవీక్షణ మి కొకవంక సంగీత శ్రవణ
మొకవంక నాటకాభిరతి యొకవంక సాహిత్యగోష్ఠు
లిక నీకు రచియింప సమయ మేదయా శ్రీకృష్ణరాయ?

వెలయించితివి సంస్కృతమున విరితావులీను కావ్యముల
కల నాంధ్ర విష్ణువానతిడగానె 'ఆముక్తమాల్యద'ను
తెలుగులో ప్రౌఢకావ్యముగ తీర్చిదిద్దితివద్భుతముగ
కలకాలమాంధ్రసాహితికి గర్వహేతుప్రబంధమది.

'సత్యావధూప్రీణన' మను సరసకావ్యము వ్రాసినట్టి
అత్యంత శృంగార రసమయాంతరంగుడవైన నీవు

రత్యనంతరనిద్రలోన రాణిపాదము తాకినంత
నీత్యుగ్రమతి నాయెవీడి యరిగితివన నమ్ముటెట్లు?

ఆనాడు కవి దిగ్గజంబులర్థముల్ కొని నిన్నుపొగడి
రీనాడు కవుల మేమిచట నేయాశలేక స్మరింతు
మేనాటికిని నీదుకీర్తి యిలనెల్లవ్యాపించి జనుల
మేనులన్ పులకింప జేయు, మెరయు నింగిని తారయౌచు

## విశ్వవినుత శ్రీశ వేంకటేశ

- మాధవీ సనారా

*9440103134*

పుణ్యమైన కొండ పూజించదగు కొండ
తిరుమలేశు కొండ దీప్తి నిండ
వేదన తొలగించు వేంకటేశుని కొండ
విశ్వవినుత శ్రీశ వేంకటేశ

కొండలందునున్న కోనేటి రాయుడా
కోటి దండములిడ కోర్కె దీర్చు
భక్తితోడ మ్రొక్క శక్తినిచ్చెడు వాడ
విశ్వవినుత శ్రీశ వేంకటేశ

ఆర్తితోడ పిలువ ఆదుకొనెడి దేవ
ఆపదందు కాచు ఆదిదేవ
నీదు భజన మాకు నిరతమ్ము దిక్కయ్య
విశ్వవినుత శ్రీశ వేంకటేశ

దర్శనంబు కొకు ధనమంత పోతురు
లెక్కచేయరయ్య మిక్కుటముగ
నీదు దర్శనంబె నిధిమాకు నిలలోన
విశ్వవినుత శ్రీశ వేంకటేశ

పంచభూతములను పంచేంద్రియములను
నీదు నాజ్ఞతోడ నిలువరించు

'బాసు' నీవె కావె బ్రహ్మాండమందున
విశ్వవినుత శ్రీశ వేంకటేశ

తిరుమల తిరుపతిని తీరుగా నున్నట్టి
నాలుగక్షరముల నామమహిమ
నాల్గుదిశల ప్రజలు నరుదెంచు
విశ్వవినుత శ్రీశ వేంకటేశ.

ఏడు కొండలందు నిటకాకుళమ్మున
వెలసినట్టి ఆంధ్రవిష్ణువగుట
పద్యసుమములేడు భక్తినొసగుచుంటి
విశ్వవినుత శ్రీశ వేంకటేశ

# శ్రీ కృష్ణదేవరాయ !

- డా॥ అయ్యదేవర విజయభాస్కరరావు

*9014446272*

ప్రథితుడైనట్టి వరకవిరాజితండు;
ధరణి నెన్నగ వైష్ణవ దాసుడితడు ;
అష్టదిగ్గజ కవులతో అలరినట్టి;
ఘనుడు శ్రీ 'మూరురాయర' గండడితడు !

# ఆంధ్ర విష్ణు మహాదేవ! అమృత జీవ!

*- డా॥ రామడుగు వేంకటేశ్వరశర్మ*

*9866944287*

1)ఆ.వె. విష్ణులందు ఇతర విష్ణువులెవరేనిఁ కలరె? లెస్స అయిరె? కళ(ల)ను చిలికి;
ఆంధ్రవిష్ణువొకడె హైలెస్స– ఆంధ్రభోఁజునికతానలెస్స – తెనుఁగుకూడ"

2) సీ నీకతమ్మునగదా! నిక్కమయ్యె తెలంగు! కల అద్వితీయమౌ కళ చెలంగి
నీకతమ్మునగదా! లోకాన ఆముక్త । మాల్యదాసత్పరీమళము వీచె
నీకతమ్మునగదా! "శ్రీకాకుళము" "పురుఁషోత్తము"కీ(అ)ర్తి "కాసులు" ఫలించె
నీకతమ్మున గదా! ప్రాకటవ్యాజనిం । దాలంక్రియయె ఎక్కెనందలమ్ము
నీదుకతమునగాదొకో! స్వాదు తెలుగు । దేశభాషలలెస్సగా దీప్తిగనియె
నీవు లేకున్న తెలుగెల్ల నిజము లెస్సె । రాయలేమొ మైనస్సై; నా ప్రణతులివియె
ఆంధ్ర విష్ణు మహాదేవ ! అమృతజీవ!!

## ఆంధ్రభోజ ! శ్రీకృష్ణరాయా ! నమోస్తు

1) విష్ణు చిత్తుని యింట వినిపించునే వేళ । నాస్త్యుష్ణతాశాకనాదరుచియు
మాలదాసరి జగన్మంగళ కైశికీ । గాన ప్రవాహ రాగాల సొగసు
ఆముక్తమాల్యదాహారికల్యాణంపు। కథలోన తోచెడి మధురభక్తి
ఋతువర్ణనములందునతిలోకగతినర । ప్రకృతిఁ జిత్రించెడి ప్రాభవంబు
తెనుఁగు విజ్ఞాన సర్వస్వమనగ కృతిని । భవ్యపరిపక్వగతిఁబెంచు ప్రౌఢిమంబు
ఆంధ్రభోజ! శ్రీకృష్ణరాయా! కవీంద్ర! । నీకెగలదోయి 'గలదోయి' నిజమునిజము
వందనంబులు – సాహితీ చందనములు

## "కాసుల" - పుణ్యపేటి

(జయదేవుడు)

1) చం తెనుఁగుల పుణ్యపేటి - కవిదేవుఁడు పోతన పుట్టకున్నచో
ననితరసాధ్యమైన గతి నాంధ్రికి భాగవతంబుఁగాన్కగా
ననయమొసంగఁగాఁగలఁడయా! అని చెళ్‌పిళ సత్కవీశుచే
వినుతిఁగొనంగ లేదె! కవివీరుఁడ ! "కాసుల పురుషోత్తమా"

2)సీ॥ శ్రీమహావిష్ణుని "దామోదర" ఖ్యాతి। వ్యంగ్యంబుగాఁ దెల్పు వైభవంబు
పారిజా-తాపాపహారిగాథను, భాగ। వత కృష్ణలీలలన్ బలుకు పటిమ
అరయ - శంతనుపుత్రునమృతంపుఁ బద్యైక। గుళికను నీదిగాఁ గొనెడి ప్రజ్ఞ
పోతపోసిన అల్లపోతన్న వైకుంఠ। పురిఁబుణ్కి పుచ్చుకోవరచతురిమ
మరచిపోలేని రీతిగా మాకు నెపుడు। "ఆంధ్రనాయకశతకా"న నలరుఁగాదె!
చిత్ర చిత్ర ప్రభావ! విశిష్ట జీవ్! "పూరుషోత్తమా!" "కాసులా!" పుణ్యపేటి!
వందనంబులు - సాహితీచందనములు"

### ఆత్మనాదం - తెలుగు వేదం !

1)సీ॥ శాసనారణ్యాల సరసాల మురిపాల। దివ్వెలై - రవ్వలై - నవ్వు భాష
జ్ఞానపథంబులే జానపదాలలో। అందమై- అరవిందమైన భాష
విన్నాణపున్ రుచిన్ వెన్నపూసై - స్వచ్ఛ। "నీతి చంద్రిక"లతో నెగడు భాష
వలయుచో పిడుగుగా - వన్నెల వెన్నెల। గొడుగుగా - వాడుక నడరు భాష
అభ్యుదయ భావ విప్లవం బైన భాష। "పెద్ద బాలశిక్ష"గ వెల్గు ముద్దు భాష
పూర్ణ "ముత్యాల సరమౌ"చు మురియు భాష। కలిత వాత్సల్య సురయోష -
॥తెలుగు భాష॥

## పద్యపట్టం

- గోలి ఆంజనేయులు

పద్య కవిత కిచట పట్టంబు కట్టగా
విబుధలంత కలసి విజ్ఞతకల
ఆంధ్రవిష్ణువిచట ఆవరించె నిజము
తెలుగు వెలుగు పంచె తీయగాను

# ముదిమి వయసున ఆటవెలదితో సయ్యాట

- గబ్బిట దుర్గాప్రసాద్

1. అలతి అలతి పదము లల్లిక బిగి చేత
అలర రాజ నియతి నందమొప్ప
ఇలను 'మెచ్చ' యాము"డింపుగా బల్కెను
పలుకు రాయలదని ప్రణతు లిడుదు

2. రాయలేలినట్టి రాజ్యమ్ము మనదిరా
రాయ వాచకమ్ము రసన కింపు
రాయ కవన సుషమ రంజిల్లు మనసున
రాయ ! కృష్ణ రాయ ! రమ్య తేజ.

3. తెలుగు భాషకు గుడి, తెలుగు భాషకు నుడి
తెలుగు పలుకు తీపి తెలియ జెప్పి
తెలుగు రాయలకును దీటెవ్వ రనగను
తెలుగు కీర్తి జగతి వెలుగ నిలిపె.

4. అమ్మ భాష నీవు అబ్బుర పడు రీతి
కమ్మగాను బల్కి కాచి నిల్పు
చెమ్మ దగులు మదికి చేయెత్తి జైకొట్ట
అమ్మ నెపుడు నీవు ఆదరింప

5. ఆట వెలది తోడ ఆట లాడంగను
తీట బుట్టె ముదిమి తీరి దేమొ
మాట కదలకుండ మారాము చేసినా
పంచ రత్నములను కొంచ కిచ్చె...

# తెలుగుప్రతిన

- పచ్చిమాల శివనాగరాజు

"దేశభాషలందు తెలుగులెస్స"యటంచు, ఆంధ్ర విష్ణువెపుడొ ఆనతిచ్చె
అట్టి తెలుగుబాషనాదరింపుడుబుధుల్
తెలుగుబాసమించు తీపి కలదె?

మా అమ్మ ఒడిలోన మారామ సమయాన
జోకొట్ట నిదురించు జోలతెలుగు
నాన్న కౌగిటిలోన నన్ను బంధించిన
ఆ తీపి గురుతుల ఆర్తి తెలుగు
తాతయ్య నాన్నమ్మ తగమేన్నమామలున్
పిల్చిన తొలినాటి పిలుపుతెలుగు
తమ్ముళ్ళు చెల్లెళ్ళు దారబిడ్డలతోడ
మమతానురాగాల మాటతెలుగు

పలక బలపము చేబూని వ్రాయతెలుగు
ఆటపాటల సఖులతో నలరు తెలుగు
పారగునపము ధరియించు పనుల తెలుగు
పలుకు పలుకున పులకించు భాష తెలుగు

మాతృభాష మనది మహనీయమౌతెల్గు
పద్యపరిమళమ్ము పంచు తెలుగు
చదువ హాయినిచ్చు ఛందస్సు మన తెల్గు
సరస భాషణమున జాను తెలుగు

తెలుగుకు కష్టకాలమని ధీనిధులెందరొ బెంగతోడ నీ
తెలుగుకు జీవమిచ్చుటకు తీవ్రతరమ్మగు చర్చజేసి యీ
తెలుగు ప్రపంచమంతటను తేజమునొందగ జేయగోరి "నా
తెలుగిక లెస్సయౌననుచు దేశవిదేశబుధాళి పిల్చెగా!
నేనిక తెల్గునే పనులనేకములున్నను పల్కుచుండెదన్
చానయు సంతుతోనయిన చక్కని తెల్గునెబాససేయుదున్
పూనిక పల్కు చుంటినిది బ్రోవుమ తెల్గును నిత్యభాషణన్
వాణికి సంతసంబుననుఁవంతయు తగ్గని యత్నమూనెదన్!

## తెలుగు భాష ఆవశ్యకత

- మద్దా సత్యనారాయణ

*9849257034*

దేశభాషలందు తెలుగు లెస్సని కృష్ణ
రాయలనెను గాని రమ్యమైన
సంస్కృతంబు లేని సాహిత్యమున్నదా?
తెలుగు వెలుగులీను దేశమందు.

భాష ప్రాంతీయతలగూర్చి పరగ బల్కి
నోరుదెరచిన నాంగ్లమ్ము నూటలుమియు!
సిగ్గుయెగ్గులు గానక చెలగు చుంద్రు
తెలుగునాంగ్లమ్ము సగమాడు తెలుగు దొరలు!

తెలుగుపై మమకారముతెగువ గలదె?
ఆంధ్ర తెలగాణ గుడులలో నమలుపరచు,
దైవయర్చనల్ తెలుగున తనరజేసి,
దేవ భాషకు బదులుగా తెలుగు జేసి!

ప్రభుని పేరట యర్చనల్ భారముడుగ,
పేద నిరుపేదలకుగల్గు నూరడింపు,
వలదు సంస్కృతమే మాకు వలయునంచు-
పట్టుబట్టెడు వారల నట్టెబెట్టి!

సురలకు, నిలభూసురులకు,
అరుదైనది దేవభాష యనగాజెల్లున్!

అరయన్ బడి / గుడి, సభలన్
పరబాసయిపోయె తెలుగు పలుకులు కరవై!

గుడుల బడులందు తెలుగమ్మ నడచినంత,
తెలుగు గత వైభవమ్మున తేజరిల్లు!
సంస్కృతాంగ్లమ్ములకు బానిసలమునైన
బ్రతుకుటదిబానిసత్వపు బ్రతుకుగాదె

బడిపిల్లలు తెలుగు చదువ
గుడులన్తెనుగుననె పూజ తేటగజేయన్,
చెడునే తెలుగమ్మ వెలుగు,
చెడినదిపై కారణాన జీర్ణతృణమై!

అవసరము తెన్గు మనుగడ కవసరంబు,
ప్రాథమికమర్హతగ రాష్ట్రభాషజేయ,
తెనుగు తప్పనిసరిజేయ తెనుగుదనము,
రాష్ట్ర రాష్ట్రేతర ఖ్యాతి రహివహించు!

# తెలుగుకందము

- రాధశ్రీ

కవి రాధశ్రీ కోరగ
భవదీయుల కొసగుకావ్య భావనతోడన్
కవితామృత చేతనతో
భవికములను రెండువేల పదిహేడు ధృతిన్!!

పద్యము విదులకు హృద్యము
పద్యము భారతికి హృదయ పద్మమ్మందున్
పద్యము మన నేపథ్యము
పద్యము రూపమ్ము తెలుగు ప్రత్యేకతకున్

కర్మఠులకు పండుగయై
దుర్మఖియై తొలగజేసి దురితచయంబున్
నిర్మములగు మిముగాచును
వర్మమ్మై రెండువేల పదిహేడు ధరన్

పద్యమ్మై పల్లవింపగ
పద్యమ్మే పరమళించి పరవశమిడగన్
పద్మమ్మై పరిఢ విల్లగ
పద్యమ్మున మాటలిడు ప్రతిననుగొంటిన్

పదములు వేవిధములు నా
పదయుగళిని కడిగి కడిగి ప్రార్థన చేసెన్
విదుడవు మమ్మిక చేకొని

కదమును త్రొక్కించమనెను కందములోనన్

పండితవర్యులకెప్పుడు
దండిగ అండల నొసగెడి ధర్మాత్ముండౌ
మండలి బుద్ధప్రసాదుకు
దండములందించుచుంటి దయగొను మనుచున్

వాడుక భాషను నేనిక
వాడెద పద్యాలలోని వాడిని తెలుపన్
నేడే కవి పండితులను
వేడెద సంక్లిష్టపదమువీడుట కొరకై

శ్రీకాకుళాంధ్రదేవుని
కాకోదరశయను, దివకరుణామృతమున్
చేకూర్చగ నేగోరుచు
తేకువతో చెప్పుచుంటి తీయని కవితన్

పద్యమె నా పరమాన్నము
పద్యమె నా పసిడిమేడ - భాస్వంతంబౌ
పద్యమె నా పట్టువలువ
పద్యమె నా మానసంబు పరికింపంగన్

పద్య కవితకు బ్రహ్మోత్సవమ్మునేడు
పద్య విద్యకు బ్రహోత్సవమ్ము నేడు
పద్య కవులకు బ్రహ్మోత్సవమ్ము నేడు
పరవశమునకు బ్రహ్మోత్సవమ్ము నేడు

శ్రీకృష్ణ దేవరాయల
ఆకృతిగా నిలిచినట్టి ఆత్మీయులకున్
చేకూర్చ పలు శుభమ్ములు
శ్రీకాకుళ విష్ణువునకు చేతులు మోడ్తున్!!

## తెలుగు విందు

- పంతుల వేంకటేశ్వరరావు

*9908344249*

సీ॥ వేడియన్నములో వెన్నపూసను వేసి
ముచ్చటగ కలిపి ముద్దపప్పు
కొత్తమీరను గూడి గుత్తివంకాయయున్
ఆవపనసపొట్టు చేవచూప
పులిహోర పూర్ణాలు బొబ్బట్లు పొంగలి
అరిసెలు గారెలు అప్పడాలు
ఒకపక్క నూరించె నులవచారు, రసము
సాంబారు వడియాలు చల్లమిరప

ఆ॥వె కొత్తయావకాయ గోంగూరపచ్చడి
అన్నియున్న విస్తరాంధ్రభాష
అట్టి తెలుగురుచిని ఆరగించొకసారి
మళ్ళియెన్నడైన మఱువబోవు

సీ॥ ఆంజనేయుని నోట నారామచంద్రుని
ప్రేమామృతంబైన పెద్దపాట
అన్నమాచార్యుని హరికీర్తనలలోని
అచ్చనానుడిపాట హాయిపాట
అరుదైన గోపయ్య ఆలపించిన పాట
భక్తి సంబంధిత భజనపాట
రాజిల్లులోగిళ్ల రసమయరాగాల

పెండ్లి పేరంటాల విందుపాట

తెॱॱగీ పల్లెపడచుల పాట పాపాయి పాట
పాడిపంటలపాటదైవాలపాట
గంగిరెద్దులపాట రోకళ్ళపాట
మలయమారుతపాట మా తెలుగుమాట

సీॱॱ పెద్దనాదికవుల పేరును నిలబెట్టి
భువనవిజయమందు స్ఫూర్తినిచ్చె
తెలుగుభాషకు ఖ్యాతి దేశమంతటనిల్పి
ఆంధ్రభోజుడనెడు ఆఖ్యపొందె
స్వప్నమందుతనకు సాక్షాత్కరించిన
శ్రీమహావిష్ణువాశీస్సు పొంది
ఆముక్తమాల్యద అద్భుతమ్ముగతీర్చి
ఆంధ్రభాషను తాను ఆదరించె

తేॱॱగీ ఒక కరంబున రణము మరొకకరంబు
సాహితీరచనలే చేత సాగుచుండ
కృష్ణదేవరాయ జయహోవిష్ణుతేజ
సాహితీ సమరాంగణ సార్వభౌమ!

సీॱॱ అదిగో చిరునగవున్ ఆంధ్రమహావిష్ణు
చూచుచునుండెనీ శోభనంత
ఆంధ్రప్రభుత్వమ్ము ఆలోచనల్చేసి
పట్టమ్ముగట్టగా పద్యమునకు
విశ్వమనోహరవేదిక నీనాడు
ఉత్సాహముగ సాగ, నున్నతముగ
పద్యకవిత్వము హృద్యమై నిల్వగ
కవులమనసులోని కాంక్షదీరె

తే॥గీ స్వర్గమందున కొలువుండు సత్కవీశు
లంత నిండుగా పొందరే సంతసంబు
తెలుగు పద్యాల సొగసుకు వెలుగువచ్చె
నంచు చాటింపువేయరేనాకమంత

సీ॥ పద్యమా! ఛందస్సు హృద్యమై యతిప్రాస
గణములన్ చక్కగా కానిపించు
గద్యమా! సరళమై కనుకట్టు చేయుచున్
పాఠకహృదయాన పాలుపోయు
పాటలా! చరణాలు పల్లవి జతచేర
వినువారి మనసున విందుసేయు
కవితలా! భావాల జవరాల చిఱునవ్వు
వెన్నెలలొలికించువింతగాను
నాటకాలు వ్యాసాలు నానావిధాలు
లేఖలు కథనానీభలేగనుండు
ఆంధ్ర తెలగాణ్యరాష్ట్రాల అద్భుతంబు
తెలుగు సాహిత్య సంపద వెలుగుపంచు

# రాయల పద్యవాణి

*సేకరణ : ఖండాపు మన్మథరావు*

"ఎక్కడి రాజ్య వైభవము? లెక్కడి భోగము? లేటి సంభ్రమం ?
బక్కట! బుద్బుద ప్రతిమమైన శరీరము నమ్మి మోక్షపుం
జక్కి గణింపకుంటి; యుగ సంధుల నిల్చియుగాలు చేతిబల్
త్రొక్కిల నమ్మను ప్రభృతులున్ దుద రూపఱకుండ నేర్చిరే?

సగరు నలుం బురూరవు, త్రిశంకుసుతున్బురుకుత్సుఁగార్తవీ
ర్యగయుఁ బృథుంభగీరథు సుహోత్రు శిబిం భరతుం దిలీపునిన్
భృగుకులు యౌవనాశ్వు శశిబిందు నసుంగుని నంబరీషుఁబూ
రుగురుని రంతి రాఘవు మరుత్తునిఁగాలము కోలుపుచ్చదే?

గృహ సమ్మార్జనమో, జలాహరణమో, శృంగార పల్యంకికా
వహనంబో, వనమాలికాకరణమో, వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాత పత్ర ధృతియో, ద్రాగ్దీపికారోపమో,
నృహరీ వాదము నాకు? లేరె యితరుల్నీ లీలకుం బాత్రముల్?

తుల లేకుండు స్వరూప రూపగుణ భూతుల్దోఁచు నేత చ్ఛ్రుతిన్
దలమైలో వెలిఁదానె యున్కిఁదెలిపెన్నారాయణం; బారుణం
బుల సామాన్య విశేషరీతి నిఖిలంబు న్శబ్దజాలంబుని
ర్మల నారాయణ శబ్దమందునె తుదన్బర్యాప్త మయ్యెన్స్మృతిన్.

శివుడు విరించి వాసవుడు జెప్పనశక్తులు, కొల్చునట్టి వా
రవుట, నిరంకుశుండ నని యక్కట పాడి, దొఱంగఁజెల్లునే?

భువనములెల్ల నీవయిన బొంతదయానిధి యమ్మలేదె? భా
గవతులు వేరె? నా కొఱకుఁ గాగ వహించుకొనంగఁ గేశవా

అబ్రహ్మణ్యము! లోన వైచికొనె నన్యాయంబున న్మత్సుతం
దా బ్రహ్మాదుల మేర నిల్పియుఁ బ్రభుత్వం బూదియుందోతురే
యీ బ్రక్కన్ ద్విజులయ్య లెల్ల సభవా రీరంగ భర్తంచు దుః
ఖా బ్రాశింబడి బాష్పకంఠుడు సముద్యద్దోః ప్రవాలుండునై

(ఆముక్తమాల్యద, రెండవ ఆశ్వాసం)

# శ్రీకాకుళాంధ్రదేవా! నీవైన మా తెలుగును కాపాడుమా!

- డా|| వైష్ణవ వేంకట రమణమూర్తి

తే||గీ|| వైష్ణవునిగ జన్మించి నే తృష్ణ తోడ
ప్రీతి శ్రీకాకుళాంధ్ర శ్రీ విష్ణుఁగంటి
కృష్ణరాయడు విష్ణు దర్శించినట్లు
రమణమూర్తి భవమ్ము సార్థకత నందె 1

సీ|| వ్యవహారమున మున్గ పండిత భాషగా
తెలుగును నన్నయ్య వెలయఁజేసె
అలతి తెల్గు పదాల వలువను తొలిమారు
తిక్కన పొత్తాల తృప్తి నింపె
నన్నయ్య తిక్కన్న నయగారముల నవ్య
మార్గాన ఎఱ్ఱన్న మలచి నిలిపె
వీనుల మెలవెట్టి వేల్పుల పలుకు
నేర్పుమై శ్రీనాథు డూర్పునింపె
మందార మకరంద మాధుర్యమున పద్య
ములఁబాడి పోతన్న పొంగిపోయె
రాయలు పెద్దన ప్రముఖులు మేటి ప్ర
బంధాల శిల్పులై వ్రాసి చనిరి
వస్తుఛందాలలో భాషలో క్రొత్తమా
ర్గంబున గురజాడ ఘనుడు కదిలె

కార్మిక కర్షక కష్టాలు కథలుగా
శ్రీశ్రీ కవిత ప్రవచించి మించె
కరుణ రసములోన కమ్మగా పాపయ్య
మృదువైన పద్యాల రీతి నాడె
శేషప్ప ప్రముఖులు చెలువైన శతకాల
భగవదర్పితముగా వ్రాసి చనిరి

తే॥గీ॥ అట్టి అందాల తెలుగు నే అణగఁద్రొక్కి
ఆంగ్లభాషలో చదువు నుయ్యాల లూప
బద్ధకంకణులైనారు పాలకులును
తెలుగు చావక బ్రతికించు తెరువు చూచి
కరుణఁగాపాడు మయ్య! శ్రీకాకుళేశ!
సదయ! మండలి బుద్ధప్రసాదుగారు! 2

సీ॥ కాంతోపదేశమ్ము కలుగంగ మాలదా; సరి, విష్ణచిత్తుని చరితఁదెలిపి,
వ్యవహార బోధకై యామున కథలోన; రాజనీతి పలుకులో రంగరించి
నెగడ పద్యఃపర నిర్వృతి వేర్వేర; ఋతు వర్ణనమ్ముల నెసగఁజేసి,
అశివక్షతిని నెల్ప ఆండాళుపై భక్తి; తాత్పర్యమెసగ తత్కథను పలికి

గీ॥ కావ్య సత్ప్రయోజనములు కలుగునట్లు
రాయలా"ముక్త మాల్యదన్" వ్రాసిపెట్టె;
తీర్చె ప్రౌఢ కావ్యంబుగా తెలుగుభాష
నదియు అజరామరంబయి అలరుచుండె 3

తే॥గీ॥ తల్లుల దినమునన్ తల్లి తనయుఁగాంచి
"అమ్మ" అని పిల్వమన్నచో "అమ్మయెవరు?
మమ్మివేగద నీవు నే నమ్మయనను"
అన్న సంతునిఁ జూచియు అంగలార్చు అమ్మ. 4

## తెలుగు బిడ్డ

- డా॥ పోలేపెద్ది వెంకట హనుమచ్ఛాస్త్రి

1.సీస॥ శ్రీకాకుళమ్ములో లోకరక్షకుడౌచు
ఆంధ్రదేశ మహత్వ మాత్మ దలప
పలనాటి శిలలలో విలయమంది వెలయ
బాలచంద్రుని చేతి బాకు నరయ
అమరావతి క్షేత్రమందొప్ప, పాషాణ
శిల్పనైపుణ్యంపు శ్రీ గనంగ
ప్రతిన గౌకొని వైరి వక్షంబు చెండిన
వెలమ బెబ్బులి యశః కలన మొన్న

గీ॥ కొండవీటిని నలరు నుద్దండులైన
రెడ్డి రాజుల శూరత లెడద దలుప
ఆంధ్ర వాఙ్మయ సత్కృతులరసి చూడ
తెనుగు రాజుల సత్కీర్తి తేటపడదె

2. తెలుగు బాసకు వన్నె తెచ్చిన పూజ్యుండు
నన్నయ ధరణియందున్ననాడు
సన్నుతించుచు వాణి కన్నీరు తుడిచిన
పోతన్న జగతిపై పుట్టినాడు

వాణియే తన ముద్దురాణియంచు వచించు
పినవీరు డవనిపై వెలయునాడు
పారిజాత వినూత్న పరిమళమ్మును పట్టి
కోరి తిమ్మన ధాత్రిఁగుప్పునాడు
కలుష రాహిత్యమగు మహాకావ్య వితతి
కవుల హృదయాలలో పుట్టఁగలుగునాడు
వినుతికెక్కిన యట్టి నీ తెనుగుఁదనము
తిరిగి చేపట్టగా లెమ్ము "తెనుగు బిడ్డ"

3. శాతవాహను భుజా స్ఫాలనంబాసేతు
శీతాచలమ్మునన్ చెలగునాడు
వేంగిరాజు లిచట వేద ధర్మంబును
కాపాడి కీరితి గాంచునాడు
చాళుక్య రాజన్య సామ్రాజ్య విభవమ్ము
భూతలమ్మున వ్యాప్తి పొందునాడు
కాకతీయుల యశః కాంతా విలాసమ్ము
గగనాంత రాళానఁగ్రాలునాడు

పల్లవాన్వయ వంశ సంభవులు లలిత
కళల కాయువు వోయింప గన్ననాడు
వినుతి కెక్కిన నీపురావిభవశోభ
తిరిగి చేపట్టగా లెమ్ము 'తెనుగు బిడ్డ'

# దేవరాయ శతకోటి వందనములు

- వంగిపురపు వీరరాఘవాచారి
9701563757

1. స్వర్ణయుగము జేయ సాధ్యమెట్లయ్యెనో
సూత్రమిప్పి చెప్పి శుభముగూర్చు
కవనకదనధీర ఘనకృష్ణరాయడా!
జయము జయము ! నీకు జయము జయము !

2. సరస, సాహిత్య, సమరాంగ, సార్వభౌమ
ప్రౌఢ భాషావ, ధూటికి, వలపురేడ
ప్రౌఢ, కావ్యాల, తీరును, పరిగణింప
నీదు పాండిత్య విభవంబు, నిలుచు మొదట

3. తెలుగు భాషణ తీపిని తెలియజెప్పి
పంచకావ్యాల తెనుగున వ్రాయజేసి
తెలుగుభాషకు ఘనతను తెచ్చినావు
తెలుగు వారికి కలలోని దేవుడీవు

4. నీదుపాలన చరితలో నెంచి చూడ
సాటిరాగల ప్రభువుల జాడలేదు
దేవరాయ నీ, కీర్తియుతేజ మెప్పుడు
తెలుగునేలన పరచిన వెలుగుయగును

5. సాగునీటిని సమకూర్చ చక్కనైన
పథక రచనలు చేసిన పటిమనీది

మంత్రి మండలి తోడ్పాటు మాన్యతము
ప్రజల శ్రేయోభిలాషివౌ ప్రభుడవీవు!

6. అమరలోకాన యతిథివై యలరునీవు
నేడు జరిగెడి పండగవేడుకలను
సంతసంబున కాంచుమా సార్వభౌమ!
వందనములివె శతకోటి వందనములు !

## జనుల భాషకు జయము జయము

- డా॥ కానుకొల్లు బాలకృష్ణ

సీ. తలయెత్తుకున్నట్టు తలకట్టు నిలబెట్టు
తరతరాల తెనుగుతనము యశము
గురియైన గురుతుగా గుడిదీర్ఘములె యొప్పి
గుణియించు గణనీయ గుణము ఘనము
ఉత్వాలు యెత్వాలు మురిపెంపు ముత్యాలు
ఒత్వాలు జోలాలి కోనమాలు
ఋత్వాలు లుత్వాలు రింఛోళి తత్వాలు
అమ్మహావర్ణాలే యబ్బురాలు

గీ. అచ్చు లైయౌల్ యయి యవులై యందగించు
పంవర్ణాక్షరాలవి పంచదార
పలుకు లంతస్థ లరుదైన మాధ్యమాలు
వెలయు నూష్మాలు నాదాల విరిసరాలు
తెలుగు వర్ణమాలయెనించు జిలుగువెలుగు

సీ॥ ఆంధ్రవైభవదీప్తు లన్ని దిక్కుల పంచు
శ్రీకాకుళాంధ్రుడే శ్రీలనొసగ
అష్టదిగ్గజముల కాప్తమిత్రుండైన
ఆంధ్రభోజుండే స మాదరింప

విమల విశ్రుతకీర్తి విపుల కావ్యాసక్తి
సరసులౌ కవులెల్ల సన్నుతింప
మువ్వంపు సడులతో ముత్యాల పదముతో
క్షేత్రయ్య ఆర్తితో కీర్తినింప

గీ॥ ముఖ్య నాయకులంతసమ్మోదమొంద
కార్య నిర్వాహకులును కం కణము గట్ట
తేనెలొలికెడి పలుకుల తెలుగు వెలుగు
జనుల భాషకు కలుగును జయము జయము

## తేటగీతి

- కోనేరు కల్పన

*9246493712*

శ్రీకాకుళాంధ్రుడా! శ్రీకరముగ దేవ
రాయల కావ్య సౌరభము కమ్మ
దనము నాస్వాదించి, తన్మయత్వమున దేఁ
గా జూపుమంటివే కలము పదును
కత్తిని నొరజేర్చి కలముచే కదను తొ
క్కించె నాకవి రాజునొ క్కింత విరతి
గొనక, నేడా స్ఫూర్తి గూడె నిచట మహా
విష్ణు కృపకొరకు జిష్ణువులయి

తే.గీ. పద్య సేద్యమున కవుల పలు విధముల
పూలు, పండ్లు పండించి నీ పూజ సేయ
అభయమిచ్చి భాషను నిల్పి ఆదుకొనుము,
ఆంధ్రులాత్మగౌరవమును ఆంధ్ర దేవ!

తే.గీ. తెలుగనక తల్లి చనుబాలు తెలివికేమి
తెగులు వచ్చె? ఎగబడేవొ తెల్లమొగము
తేట వన్నె డబ్బాపాలు దీటుయౌన
తెలియ గోరెడి మది కిది తేటగీతి

తే.గీ. చిరునగవు, సౌమ్యత తెలుగు సిరుల పంట
శీలసంపద చిరునామ చెలిమి వెలుగు
కామధేను వౌ సఖ్యత కలుగజేయ
తెలియ గోరెడి మదికిది తేటిగీతి.

తే.గీ. అవని కీర్తించు నవ్యాంధ్ర అనఘ ఘనత
తెలుగు తేజము గాగ దివ్య పథము
భారతదేశము గర్వించు భవ్య వరము
తెలియగోరెడి మదికిది తేటగీతి

# రాయలు మెచ్చిన తెలుగు

- డా॥ యన్. రామచంద్ర

గృహకల్లోలము లెల్లడ
అహమహమికమని వచ్చువాని నణచుటకరవై
అహరహమును కృషి సల్పెడు
మహనీయుని కొరకు లోకమంతయు నుండెన్.

తుళువు వంశాధీశ
దీన జన బాంధవా
వైష్ణవారాధకా
కృష్ణ రాయధీశా - జయహో - జయహో

ఆంధ్రభోజాంకితా
సర్వంసహా భర్త
కుటిలశత్రు సంహర్తా
బహుకృతి స్వీకర్తా - జయహో - జయహో

జయ జయ శ్రీకృష్ణ భూపా
పౌరుష హిమాలయ స్వరూపా
కాలాగ్ని జ్వాలా సమరూపా
పరిపంథి విదళన విరూపా - జయహో - జయహో

తిమ్మరుసు ధీయుక్తి
కృష్ణరాయల శక్తి

దేశమందను రక్తి
విష్ణుచిత్తుని భక్తి – జయహో – జయహో

ఏ సార్వభౌముని యేల్బడి వర్ధిల్ల
        విజయనగర కీర్తి వెల్లివిరిసె
ఏ చక్రవర్తితో నిట విజయపరంపరల్
        తమకు తామైవచ్చి స్థిమితపడెనో
ఏ రాజు యశములు పారాడె నల్దిశల్
        అష్టదిగ్గజ కవుల నాదరించ
ఆంధ్ర భోజుడనుచు నల్లారుముద్దుగా
        ఎవ్వాని కీర్తింతురిలను జనులు
అట్టి రాయలరాకకై ఆంధ్రప్రజలు
కలలు కనుచుండ వచ్చె నా కలల పంట
రామరాజ్యంబు తలపించు రాయయుగము
ఆంధ్రదేశ చరిత్రయందద్భుతమ్ము

ఎంత తపంబు చేసి రచియించెనొ పెద్దన గొప్ప కావ్యమా
పొంతన దీటుగా నిలుప భూపతి సత్కృతి దీర్చె నేటికి
న్నంతటి సారభూత రచనాకృతి లేదని లోక మెంచగన్
సుంతయు జారిపోని రస సుస్థిరతందిన మాల్యదాకృతిన్

కలగని దిగ్గన లేచిన
ఫలమిది; విష్ణువేమి బాధ్యతనిడెనో
కలము కదల్చిన రాయడు
వెలయించెను విష్ణు కృతిని విస్మయ మొదవన్

వస్తు వర్ణన భావశిల్పాదులన్ని
ఒక్క చోనిల్పె రాయడు నిక్కువముగ
నాటి కవిలోక మబ్బురపాటు నొంద
వైష్ణవమ్మున కొకమేర వ్యాఖ్యయనుచు.

స్థాన బలమొకాక తనలోని తృష్ణయో
దైవబలమొ ఏమొ దేవుడెరుగు
తేట తెలుగులోని తీపిని గుప్పించె
మాల్యదాకృతి సమర్చనమున.

తెలుగునకేల కట్టితివి తీయని కావ్యమటన్న వారికిన్
తెలుగుకు వల్లభుండ, మరి తెల్గన తీయని కండకాదొకో
తెలుగున కాక నిట్టి కవి దేశికులే యెడనున్న వారొకో
తెలుగన దేశభాషలను దిట్ట తనంబున తేజరిల్లదో.

ఖడ్గమొకచేత – ఒక చేత ఘంటమూని
రెండు చేతుల సారంబు పిండినాడు
నిశిని చారుడై చోరుల నిగ్గదీసి
పాలనముచేసె సర్వభూపాలకుండు.

దిక్కుదిక్కున నొక్క దేదీప్యమానమౌ
జయగాథలను చెక్కె జగముమెచ్చ
కవికుమారులదెచ్చి గద్దెపక్కన నిల్పి
ప్రౌఢ ప్రబంధాల వరల జేసె
"భువన విజయం"బను కవనపీఠము నిల్పి
సన్నుతించెను కవి షండములను

మను చరిత్రంబను ఘనకావ్యరాజంబు
పెద్దన తనకీయ స్వీకరించె

గండపెండేరములతోడ గౌరవించి
అగ్రహారాది దానాల నాదరించి
తెలుగుభాషకు, రాయడు దివ్యమైన
భద్రపీతిని సమకూర్చె ప్రజల కొరకు.

కొండవీడున రెడ్డి కులజుల సరసన
కొలువుదీరినయట్టి తెలుగు భాష
శ్రీనాథకవి రాజు చేతి ఘంటపురుచిన్
వెలుగులీనినయట్టి తెలుగుభాష
పోతనామాత్యుని పూదోట మందార
మకరంద మద్దిన మధురభాష
పెద్దనాదికవుల యొద్ద హొయలొల్కిన
జిలిబిలి పలుకుల తెలుగుభాష

ఎట్టి ప్రక్రియనైన యిట్టె యొదిగిపోవు
నట్టి గొప్పగుణములగలట్టి భాష
ఎట్టి భాషనైన నిట్టె లోగొనునేర్పు
కలది మనదియైన తెలుగుభాష.

విద్యానగర రాజవీధుల పోటీల
కంచుఢక్కను డుల్చు ఘనుడెవండు?
ముత్యాల శాల పసిడి పుష్పాల స్నానాల
తెలుగుకునేకవి తెచ్చె ఘనత?

ఆంధ్ర భాషా నైషధాబ్జభవుడంచును
రెడ్డిరాజుల యొద్ద రేగెనెవడు?
భూవిభుల సరసన భుక్తితోపాటుగా
కస్తూరికే కవి ప్రస్తుతించె?

నవనవోన్మేష కైతల నవకములను
ప్రజల కందించెనేకవి ప్రౌఢ కృతులు
"నా కవిత్వంబు నిజము కర్ణాట భాష"
అన్న శ్రీనాథుడన్నదీయాంధ్ర భాష

వేమన పూదోట వీరబ్రహ్మమునోట
వేదాంత మొకరీతి వెల్లువెత్త
హేతు తాత్త్విక శైలి నీతుల ఒరిపిళ్ళ
మానవాళి మెదళ్ళు సానబట్ట
లోకరీతులనొక దాకలన్నిలబెట్టి
సమ్మెట పోటుల కుమ్మిరెవరు?
కాలగతుల దెల్పె కాలజ్ఞాని యొకండు
కాల్పనిక జగత్తు కాల్చెనొకడు

అమ్మ భాషను మించు కమ్మదనమింకేడ
కాగడా వేసిన కంటబడదు
ఏమాటనేరీతి నెట్లుచ్చరించుటో
తెలుగు భాషా వేత్త తెల్పగలడు
పలుకు పలుకున నొక్క కులుకు చూపెట్టెడి
ద్వ్యర్థిత్ర్యర్థిపదాల దాగు శక్తి
ఖండకృతిని మహాకావ్యమందైనను

అలవోకగా నొదుగునట్టి భాష

సొంత మధురిమ లొలికించి వింతరుచుల
తెలుగు శైలూషి నర్తించు తెల్గు కృతులు
గాఢమైనట్టి నుడుల సంరూఢమైన
అర్థభావాల నలరించు నాంధ్ర భాష.

వేనవేల పదాలు లోన నిముడ్చుక
పరిపుష్టి నొందిన భాష తెలుగు
ఆర్య భాష పదాల నౌదల నిడుకొని
తత్సమ తద్భవ తత్త్వమెరిగి
దేశీయ భాషను దేహముగానెంచి
ద్రవిడ చెల్లికి నొగి దండమిడుచు
మార్గదేశీ కవిత మార్గాల దిరుగాడి
పాటల, పదముల పరిఢవిల్లి

పూర్వకవుల పురాణాల స్ఫూర్తినొంది
ప్రౌఢ శైలుల మేటి ప్రబంధములను
యక్షగానాల శతకాల యందలముల
తిరుగుచున్నది నేటికి తెలుగు భాష.

మధుర మధురంబు మనదైన మాతృభాష
సరస సంగీత సాహిత్య సౌధములను
గడుసు తనమున నిలబెట్టు నడుగు నుండి
తెలుగు భాషకు మరియేది దీటు కాదు.

కవులు, కవయిత్రులింటింట ఘంటమెత్తి

పద్యరాశుల పండించు పథము దెలిసి
గుండె గుడిచేసి తెలుగు కూర్చుండ బెట్టి
తెలుగు తల్లికి జేజేలు తెలుపరుండు.

గిచ్చిన, గిల్లిన, కొట్టిన
నొచ్చిన, రుసరుసలు పెల్లు నోటవెడలినన్
మచ్చిక యగు తెలుగుననే
స్వచ్ఛముగా పలుకు మోయి స్వజనులు మెచ్చున్.

వాడవాడల, నిలువెత్తు మేడలందు
తెలుగు వెలుగుల జిలుగులు కులుకు నాడు
మాటి మాటికి పలికెడు మాటలందు
తెలుగు తేనెలు చిందించు తెలుగు బిడ్డ!

అన్యభాషల జోలికావంత చనమి,
తెలుగు తనమున్న దేశాన స్థిరత మప్పి
కోటి యేండ్లైన కొలువుండు గుండెతోన
కలదయేని పునర్జన్మ కలుగుగాక.

# తెలుగు భాష వైభవం

- సింహాద్రి వాణి

ఉ॥ తిక్కన పోతనాదులును తీయని తెల్గుపదాలతో కడున్
చిక్కని భావనల్ పొదిగి, చెక్కిరి మిక్కిలి కావ్యశిల్పముల్
మక్కువతో, చవిన్ భువిని మన్నన నొందగ నెల్లకాలమున్
మ్రొక్కుదు వారికెప్పుడును, మోదము పొంగగ, మానసంబునన్

ఆ.వె. తేటతెలుగు భాష, తేనెలొలుకు భాష
అమ్మ పలుకు భాష, ఆంధ్ర భాష
తరతరముల భాష, తాతతండ్రుల భాష
తెలుగు గొప్ప భాష తెలుగువాడ

ఆ.వె. అమ్మనాన్న అత్త అని పిల్వు తెలుగోడ
ఆంటి అంకులనకు, అసలు నీవు
మాతృభాష కంటె మరిగొప్పభాషేది?
అమృతముగదచూడ ఆంధ్రభాష

# రాయలు

- దొంతా భక్తుని రామ నాగేశ్వరరావు

*9949726904*

దేశభాషలయందున తెలుగు లెస్స
యంచు నాంధ్రదేవుడె చెప్ప నార్తితోడ
నాంధ్ర భాషామతల్లికి ననితరముగ
సేవఁజేసి రాయలు ధన్యజీవి యయ్యె!

అష్టదిక్కుల యుద్ధాన నాక్రమించి
అష్టదిగ్గజ కవులను నాదరించి
సాహితీ సమరాంగణ సార్వభౌమ
బిరుదుపొందిన శ్రీరాయ! ప్రేమగనుమ

# సమ్రాట్టు

- మహిశ్రీ

ఆంధ్ర భాషకు కీర్తి సాంద్రత కలిగించి
కన్నడ భాషను కాపుగాచి
అష్టదిగ్గజముల నందలంబెక్కించి
భాషామతల్లిని పదిల పరచి
కవితాంధ్ర సామ్రాజ్య మవనిని స్థాపించి
పంచకావ్యంబుల ప్రభల నింపి
మను చరిత్రకు గాను, మాధవుడై నిల్చి
మంటిని మింటిని మాన్యుడయ్యె

తే.గీ. అంత ఘనమైన యశమును సంతరించి
మూరురాయరగండని ముద్రపొంది
రాజులందరి నవనిని రాజ్యభ్రష్టు
లవగజేసిన సమ్రాట్టు రాజులహరి

# విష్ణుచిత్తీములు

- చంద్రమౌళి నాగ మహాలక్ష్మి

సీ.స. ఆముక్త మాల్యద యనగ రాయలవారి
సాహితీసామ్రాజ్య చర్చకాంతి
పరిఢవిల్లగ జేయు ప్రౌఢకావ్యమనగ
కృష్ణరాయనికింత కీర్తివచ్చె
భాషలో నిండైన పరిమళమ్ములనింపి
ఇంపైన భావాల నిమిడి యుండె
సాహితీ సామ్రాజ్య, సార్వభౌముని జేసె
కావ్య పటిమ చేత గాదె జూడ

ఆ.వె. భువన విజయమ
నగ భువిపైనగల యట్టి
సాహితీ విభవపు చంద్రికలను
తరచి వెలుగు దీర్చి తారేందుసూర్యులు
నిలుచుదాక తెలుగునిలిపినావు

# అంజలిదే గొనుమా దేవరాయ

- కొమ్మరాజు కనకదుర్గా మహాలక్ష్మి

అంజలింతు దేవ ఆంధ్ర మహావిష్ణు
సిరిని కూడినట్టి శ్రీనివాస
మాదు జన్మకిదియె మాన్యమ్ము చూడగా
శాంతిసౌఖ్యమిమ్ము సర్వప్రజకు

తుళువ వంశమందు తోయజవిభుడట్లు
నరసరాజు నింట నటనమాడె
బాల్యమందు పెరిగె బహుశిక్షణంబున
విజయ నగర మందె విద్య నేర్చె

తిమ్మరుసుని వలన ధీయుక్తి నేర్వగా
రాజనీతి తత్త్వజాడలెరిగి
రాజ్యపాలనమును రంజిల్లచేసిన
మేటి పాలకుండు నేటి వరకు

శక్తియుక్తి తోడ చాకచక్యముగాను
కొండవీడనియెడికోట గెల్చె
దక్షిణా పథమంత ధాటి చూపివెలిగె
ఏకఛత్రము నందు ఏలె మేటి

సార్వభౌముడీవె సాహితీ సేవలో
ఆంధ్రభోజ, సంస్కృతాంధ్ర సుకవి
అష్టదిగ్గజముల యశమవనినిజూసి
తెలుగు వల్లభుండు తేటపరిచె

సంఘజీవనంబు చక్కతెలిసియుండి
తెలియపరిచినారు తెలుగునందు
అరయచూడగాను ఆముక్తమాల్యదన్
సాహితీ వనమున సాటిలేదు

వేంకటాద్రినాథు వేడ్క మీర కొలిచె
మేటి గోపురాలు నేటికెన్నొ
ఆభరణములెన్నొ అగ్రహారాలివె
మీదుకీర్తిచాటు మేదినందు

కన్నడమున కావ్యకౌముది పంచెగా
తెలుగు కావ్యమెంతొ తేనెలూరె
కీర్తికాంత కోరి కేలుసాచి పిలిచె
చేరినారు దివికి సేద దీర

మంగళంబు మీకు మంజులమృదుభాషి
వందనాలు మీకు వందవేలు
చందనంబు మీకు సంగ్రామ శౌరికిన్
జయము జయము మీకు జగతినంత

# శ్రీకృష్ణదేవరాయలు ప్రశస్తి

- డా॥ మద్దాల అంథోని

9440421828

## భగవంతునిపై తెలుగువారి వేడికోలు

రక్షించగలవీవు ప్రాణికోటులలోన
సీమ మొదలు గంధ సింధురములను
కాపాడగలవీవు కారుణ్యమేపార
ఖగముల గ్రహముల క్రమము తోడ
పోషించగలవీవు పుష్పజాతులనెల్ల
మకరంద సౌగంధ మనురమొసగి
తనియించగలవీవు దాతృత్వ దృష్టితో
వారాశిజీవుల వారిదముల

తే॥ కఠిన శిలలందు శిల్పాలు గాంచగలవు
మొరలుజేయగ నెల్లరి మోదమలర
గాచి నట్టి నీ మహనీయ కరుణమహిమ
దీన జనుడను నను గావ దిక్కురావ

## తెలుగువారి విన్నపము

సీ॥ దానధర్మంబు తడయక సేయగ
అందియున్నది మీకు ఆత్మశక్తి
పిన్నపెద్దల నెప్పు మన్నింపనేర్చుట
అమరియున్నది మీకు అమరశక్తి

భగవంతునెదలోన పదిలపరచునేర్పు
భద్రమైనది మీకు దివ్యశక్తి

ఆ. అందజేయు మీదు ఆప్తహస్తమునెల్ల
కష్టకాలమందు కలిసి నిలిచి
వాస్తవాలనెల్ల పల్కెదుమొగమువై
మీదు నైజమదియెమిన్నగాను

## పంచపాళి

- మాదిరాజు బిందు వెంకట దత్తశ్రీ

తే॥గీ॥ సూర్య చంద్రులు వంతు లేసుకొని, జగము
నంత వెలుగులు నింపుచు, అవని మీద
ప్రాణకోటికి యెయ్యెడ భవ్యమైన
శక్తినిచ్చుచు ప్రకృతి పోషణము చేయు
తెలుగు వెలుగును శ్రీకృష్ణదేవరాయ!

# అక్షరాంజలి

- దూపాటి రామాచార్యులు

కమ్మని పద్యరత్నమాలు కౌతుక మొప్పగు మాకొసంగి మా
కమ్మగు భావసంపదల నిచ్చిరి కాన్కగ ఆంధ్రమందునన్
నమ్మిన వారికెల్లెడల నచ్చిన రీతిని మీదుశైలియున్
ఇమ్మును గూర్పదే సుకవి యిద్ధరపైనను ఎల్లవేళలన్

అమలిన భావవీచికల కందము చిందెడి రూపమిచ్చినీ
సుమధురమైన గ్రంథమును స్ఫూర్తిగమాకు నొసంగినారుగా
సుమనస వందనమ్ములను స్ఫూర్తిగ నిచ్చుచునంటిసత్కవీ
సముచిత స్థానమున్ పుడమి స్థాయిని బొందిన నీకు నిత్యమున్ -

# రామకృష్ణుల రాజ్యాలె రాణకెక్కె

- డా॥ యస్వీ రాఘవేంద్రరావు

9299659262

తే॥ 'సాహితీ సమరాంగణ సార్వభౌమ!'
అత్తకోడండ్రు నీ యింట పొత్తుతోడ
చిరము కాపురంబుండి యచ్చెరువు గొలుప,
విభవ కవితా ఘనశ్రీల వేడ్క నొసగ
దిగ్గజారుఢ నీకీర్తి దివ్య హంసి
విహరణంబు జేసినది దిగ్వీధులందు,
'భువన విజయాభిరామ!' సంపూర్ణమూర్తి!
అష్టకవి కల్పభూజ! ఓ 'ఆంధ్రభోజ'

తే॥ లోకులు తమ 'నాలుగు వ్రేళ్లు లోనికేగ'
'మూడు పూలారుకాయలై ముచ్చటలర,
'నిత్య కల్యాణమై' ప్రజ నెగడు చుండ,
'పచ్చతోరణంబుగ' తమ బ్రతుకు పండ,
'కడుపులో చల్ల కదలక' గడిపిరంట!
మాన్యులుగ జేసితీవు సామాన్యజనుల,
జగతియందు నీ పాలన స్వర్ణయుగము,
"రామకృష్ణుల రాజ్యాలె రాణకెక్కె"

సీ॥ "దేశభాషలయందు తెలుగు లెస్స"ని యన్న
దిగ్విజయా! "కృష్ణదేవరాయ!"

'అష్టదిగ్గజము'లే యాశ్చర్యముం బొంద
'ఆముక్తము'ను జెప్పినట్టి సుకవి!
'మనుచరిత్ర' స్వీకరణవేళ 'పెద్దన'
పల్లకీనెత్తిన పార్థివేంద్ర!
దిగ్గజమున్డిగ్గి, 'దిగ్గజమునే' పైకి
నెక్కించుకున్నట్టి యిద్ధచరిత!

తే॥ చక్కనైన నీ పాలన సంస్మరించి
కాకుళాంధ్ర మహావిష్ణు గడపలోన
పద్యకవితా మహోత్సవాల్ భక్తి నెఱపి
ఈగ గల్గితి మేము నీ ఋణము కొంత
అందుకోవయ్య మా హృదయాంజలులను

తే॥ రత్నపు మొలక లంగళ్ల రాశిపోసి,
కుంచములతోడ ముత్యాలు కొలిచివిలుచు
రత్నగర్భ, విజయఖని, రసికధరణి,
తెలుగు నేల నేలితి కృష్ణదేవరాయ!

ఉ॥ రాయలసాటి యెవ్వరిల రాజిత సంగర సాహితీ మహో
పాయములందు, పల్కులవి పాయని యస్త్రములై జయంబిడున్
తీని కంఠమెత్తగనె తేనెల సోనలు జాలువారెడున్
హాయని ఖడ్గముల్ కలము లంతటవీడి జయంబు బల్కరే
జే!యని వీరులున్ కవులు; చేకుఱు శాశ్వతకీర్తి భూవరా!

ఉ॥ ప్రాకట సాహితీ సమరరంగ విరాజిత సార్వభౌమ ! నీ
దేకద పృథ్వి స్వర్ణయుగ దిగ్జయపాలనా శౌర్యబంధురా!
ఆ కవి దిగ్గజాలమెయి నాదర గోష్ఠుల మున్గితేలుచున్
మేకొని కీర్తి చంద్రికలమేదిని గ్రాలవె? ఆంధ్రభోజుడా!

## మాతృభాషను సేవించి మనగదయ్యా!

సీ॥ ఆపాత మధురమై యానంద మందించు
దివ్యవాక్సతి మన తెలుగుభాష
ఆలోచనామృతమై చవులూరించు
తియ్యందనంబుల తెలుగుభాష
జగతినజంత భాషగ కీర్తి గడియించు
తేటతేట నుడుల తెలుగుభాష,
సరసాంగి, యనుకూల, సరళయై యొదిగెడు
దేవభాషాపుత్రి తెలుగుభాష,

తే॥ "అట్టి భాష నేర్చుకొనుట, యట్టి దేశ
మందు పుట్టుటయును నన్న నల్పఫలమె?
అది తపః ఫలం "బనుట యథార్థమయ్యా!
మాతృభాషను సేవించి మనగదయ్యా!

పద్యము తెలుగువాడి ఆస్తి

ఉ॥ పద్యము వారసత్వమగు భాగ్య, మనంత వసంతకాలం సం
పాద్య, మమేయమౌ నమృత భాండము, దివ్యము, శారదాంబ నై
వేద్యము శ్రావ్యము న్, హృదయవేద్యము, హృద్య, మనన్యలభ్య, మా
రాధ్యము, భోగ్యమాంధ్రులకు రక్షణ యోగ్య, మఖండ యోగమున్.

# తీపి జ్ఞాపకము

- ఆముదాల మురళి

*9440432683*

మ॥ తను గీర్వాణ మదాలసాచరిత సత్యాప్రీణనాదుల్ రచిం
చిన గీర్వాణులు లుబ్ధులై గొనిరి రాశీభూత సౌందర్యపుం
గనులౌకావ్యములెల్ల, మర్త్యులకు మృగ్యంబయ్యె నేయంచు, తె
ల్గునుడిన్ రాయలు విష్ణుచిత్తుకథ వెల్గుల్ జిమ్మగా వ్రాసెబో

మ॥ తన రాజ్యంబున పౌరులెల్లరును రత్నాలమ్ము చుండంగ, నూ
తనమౌచెర్వుల, పంట కాల్వలను శ్రద్ధాసక్తులన్ ద్రవ్వగా
ధనమున్ ఖర్చొనరించు రాయలమదిన్ దారాడు భావంబులీ
జనసామాన్యము, నేటి నేతలకు పూజార్హంబు లీనాటికిన్

మ॥ తనయాస్థానములోని పండితులు సత్కావ్యంబులన్ వ్రాయగా
తన పేరోలగమందు మంత్రులరితంత్ర ధ్వంసముల్ జేయగా
తన సామ్రాజ్యములోని పాలితులు విద్యావంతులై శాంతితో
మనుచుండన్గనె కృష్ణరాయలిట భూమానందసందోహమున్

మ॥ తనమత్తేభము కావ్యకర్తలగు పెద్దన్నాదులన్ మోయగా
తనకున్ దానుగ పల్లకీల కవి దిగ్దంతావళిన్ మోయగా
తనకన్సైగల గూఢచారులగు వార్తాహారులుండంగ, కీ
ర్తినిగారంబుగ రాయలేలెభువి,cగీర్తింపంగ వైదేశికుల్

శా॥ ఏ సౌభాగ్యము కృష్ణరాయనృపుడాశింపంగ నీసీమలో
వాసింగాంచెనొ శిల్పశాస్త్రములు కావ్యాంభోనిధుల్, నాట్యవి

న్యాసంబుల్ గుడిగోపురాలు మడిమాన్యంబుల్ సమస్తంబు, నే
డా సౌభాగ్యము కాలదోషమున నన్యాక్రాంత మయ్యెంగదా!

మ॥ తనుపాలించెడినాడు వచ్చి, కని ప్రత్యక్షంబుగా రాజ్యపా
లన నీరతిగ జేయబోలునని కాలాతీత రాజ్యాంగ వా
సిని చాటించిరి నాల్గుదిక్కుల విదేశీయుల్, తదౌన్నత్యముల్
వినిరాయలు తీపి జ్ఞాపకముగా విన్పించునీనాటికిన్.

## అక్షర హారతి

- దేవవరపు నీలకంఠరావు

*9989966012*

శరణు వేడిన భక్తజన కోటి దుఃఖార్తి
బాపగల్గెడు తెల్గు వల్లభుండ!'
ఆంధ్రభాషాక్షర హారపూజిత పాద!
బాసదేవర ! కైటభారి ! దేవ!
అలకృష్ణదేవరాయలకు స్వప్నమునందు
సాక్షాత్కరించిన మోక్షదాత!
స్కాంద బ్రహ్మాండాది సత్పురాణ వినుత!
దివ్యగుణాలయ! 'తెలుగురాయ'!

కమల నయన! నీ కారుణ్య గరిమ వలన
పాడిపంటలు తమితీర పరిఢవిల్లి
కవుల పుట్టిల్లుగా నేడు ఘనత గాంచి
మహిత కీర్తిని గనె కృష్ణ మండలమ్ము!

'ఎంతటి చక్రవర్తి మరి యెంత ధనాఢ్యుడు నైన కీర్తి ఆ
వంతయు నిల్వబోదు కవి యాతడు గానిదె' యంచు నీదు వృ
త్తాంతము వ్రాయజేసితివి ధర్మ ప్రభుండగు కృష్ణరాయ భూ
కాంతుని చే నమోఘమగుకావ్యము కాకుళ తెల్గుదేవరా!

మగనిని అత్తమామల నుండి విడదీసి
వృద్ధుల బాధల పెట్టు స్త్రీలు

పనికిమాలిన చెత్త పదవికై ఆశించి
    గడ్డి కరచు నాయకాధములును
కులము నడ్డము పెట్టుకొని విర్రవీగుచు
    లబ్ధిపొందెడునట్టి లౌక్యమతులు
హిందుత్వముఁ బరిహసించుచు లౌకిక
    వాదుల మేమని వాగువారు

కలరు కలరెందరో నేటి కాలమందు
వారి మదిలోన సద్బుద్ధి పాందుకొలిపి
మంచి మార్గాన నడిపించి మనుపుమయ్య!
అఖిల హిత భావ! శ్రీకాకుళాంధ్ర దేవ!

# "తెలుగమ్మ"

- తన్నీరు బాలాజి

సీ. ఆంధ్రదేశంబున అద్దంకి సీమలో
పందరంగ జనిత పసిడిబాల
నన్నయ కాలాన నడకలు నేర్వగ
కవిబ్రహ్మ పలుకుల కమ్మని సుధ
శ్రీనాథు నీడలో సిరిమువ్వ హొయలతో
నాట్యమాడినయట్టి నవ్యతార
పోతన కలమున పొందుగ జారిన
మందార మకరంద మరుల జాణ
ఆ.వె. ముక్కుతిమ్మనార్యు ముద్దుముచ్చట్లతో
పెద్దనాది కవుల పేర్మితోడ
పరిఢవిల్లె తెలుఁగు ప్రాబంధనాయిక
కృష్ణరాయఁజేరి కృపనుఁబొంద

సీ. ముత్యపు సరులతో మోదముఁబొందగ
గురజాడ వారిచేఁ గూర్చబడియె
నండూరి ఎంకితో నాయుడుబావకు
పాటలు నేర్పించి పరవశించె
శ్రీశ్రీ యొసగినట్టి చెంగావి వన్నెల
సింగారపు జరీల చీరగట్టె
భావాభ్యుదయ మేలి పరిపుల్లరూపమై
"విశ్వంభరా"లలో వినుతికెక్కె

తే.గీ. అన్యభాషాపదాలకు స్తన్యమిచ్చి
నవల, నాటక, చరితల నడతఁబెంచి
తనరె పరిపూర్ణరాశియై; – తనదుయింట
నేడు తెలుగమ్మకు నిలువనీడలేదు

వ. "ఆ తెలుగమ్మ ఇలా అంటుంది."

ఆ.వె. తల్లిపాలుద్రాగి తల్లిని మరచిన
తల్లిరొమ్ము గ్రుద్దు తనయులార!
మాతృక్షీర మధురిమలను మరచినారు
"దాది" ప్రేమ మాటు దాగినారు

కం. ముదుసలియగు మీయమ్మను
ముదుసలిశాలకు తరుమగమురుతురు కొడుకా!
ముదుసలియగు ఈ యమ్మను
ముదుసలిశాలకు తరుమగ మోదము గలదే!

వ. "ఆ తెలుగమ్మ తన బిడ్డలను ఇలా
ప్రాధేయపడుతుంది."

తే.గీ. చేరదీయుము నన్ను మీ సేవఁజేతు
ఆదరింపుము నన్నుమిమ్మాదరింతు
అమ్మప్రేమ, అమ్మ నుడియు యమృతమగును
మాతృభాషను మాతను మరువకెపుడు

# ప్రశస్తి

- డా॥ గురజాడ రాజేశ్వరి

*9440709939*

సీ॥ భరతనాట్యకళా చతురుడు సిద్ధేంద్ర స
ద్గురుపీఠ నిలయమ్ము కూచిపూడి
విమల కృష్ణాబ్ధి సంగమ పవిత్ర స్థలము
హంసలదీవి కృష్ణాలయమ్ము
అభినయ శాస్త్ర విద్యా ప్రవీణుడు వర
దయ్య విద్యానిలయమ్ము మొవ్వ
మ్రొక్కు బడులనందు పుణ్య సుబ్రహ్మణ్య
మూర్తి దేవళము శ్రీ మోపిదేవి

తే॥ కళగనొప్పు దేవళములు కలవు ఎన్నొ
కృష్ణమండలమునగల కీర్తిగన్న
స్థల పురాణముల్ వర్ణించ సాధ్యమగునె
కవులు పండితుల్ కలమును కదుపగలరె

# తెలుసుకొనుము

- ఎం. నీరజ

ఆంధ్రనాయకుండు అవతరించెనిచట
దేశభాషలందు తెలుగు లెస్స
యనుచు పలికె నాడు అందరు మెచ్చగా
తెలుగుభాషనెపుడు తెలుసుకొనుము ॥ఆటవెలది॥

# శ్రీకృష్ణదేవరాయ సంస్తుతి

- డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

శ్రీకృష్ణదేవరాయల
యాకృతి నా మమ్ములందు నద్భుతమేదో
ప్రాకటముగ భాసించును
తాకిన నాముక్త మాల్యదను మనచేతన్

శబ్దయోజన చూడ పాషాణభంగి
కానిపించును రాయలకాయకుట్లు
అర్థమారసిచూడగా నమృతమట్లు
యెదలనూరించు రాయల హృదయమట్లు

ఆతని కావ్యము జదినిన
చేతస్సున నిండిపోవు చిన్మయశక్తుల్
ఆతని వీరత గాంచిన
చేతులు చప్పట్లు కొట్టు జేజేలనుచున్

ఆతడెత్తిన కత్తి కదురేది బెదరేది
అరివర్గ మెల్లెడ శిరసువంచె
ఆతడెక్కిన గుఱ్ఱపడ్డులన్నిటి ద్రొక్కి
పరుగులెత్తగ గిరుల్ శిరసువంచె
అతదుపన్నిన వ్యూహ చతురతన్ దిలకించి
పులకించి కోటలు తలలువంచె
అతడు సల్పిన ధాటి నరికట్టలేని తు

ర్కలసైన్యమెల్ల శీర్షమునువంచె
రాత్రి పగలును భయదగర్జనలు సలిపి
యుద్ధ సైన్యాలనెపుడు సముద్ధరించి
గజపతుల నెల్లజోడించి కటకమాది
దక్షిణావని నేలిన దక్షుడతడు

సంస్కృతాంధ్రములందు సమకౌశలము దెల్పు
రాయలమీసముల్ రమణకెక్కి
శైవవైష్ణవముల సమదృష్టి బ్రకటించు
రాయలమీసముల్ రమణకెక్కి
శాత్రవదమనము సత్పాలనము జాటు
రాయలమీసముల్ రమణకెక్కి
సతులిద్దఱును భావసమలని సూచించు
రాయల మీసముల్ రమణకెక్కి
కృతులు రచియించుటను కవికృతులగొనుట
భువన విజయమ్మునందును కవనవిజయ
మందు సమమని మెఱయించి యందగించి
కృష్ణరాయలమీసముల్ కెరలుచుండు

ఒకచేత రాజ్యలక్ష్మికి స్వర్ణమకుటాన
ముద్దుగా నవరత్నములను పొదిగి
ఒకచేత కావ్యలక్ష్మికి స్నిగ్ధచికురాల
పొలుపుగా అందాలపూలు ముడిచి
ఒకచేత విజయలక్ష్మికి పాదములనీడ
పరరాజశిరములవంచి నిలిపి
ఒకచేత వరలక్ష్మికి సంతసముగూర్ప
శంఖ భేరీ పృథుస్వనము వినిచి

తుళువవంశ సంజాత చతుర్భుజుడయి
చతురమతితోడ సాహితీసమరరంగ
సార్వభౌముడై తెలుగుల స్వాంతసీమ
వెలుగు శ్రీకృష్ణదేవరాయల నుతింతు

ఖడ్గమెత్తినట్టి కఠినకరమ్మున
కలమునెట్లుపట్టె లలితరీతి
స్వప్నమందుగన్న జలంజాక్షుడేనిల్చె
ఖడ్గమందు అతని కలమునందు

అంతగొప్ప కావ్యమాముక్తమాల్యద
కృష్ణదేవరాయలెట్లువ్రాసె
వింతయేమి? స్వప్నవేళాగతుండైన
ఆంధ్రవిష్ణుమహిమయని తలంతు

సరిలేరెవ్వరు; విష్ణు కావ్య రచనా శైలీ విలాసమ్మునన్
సరిలేరెవ్వరు; స్వీయరాజ్యజనతాసౌఖ్య ప్రదానమ్మునన్
సరిలేరెవ్వరు; దివ్య వేంకట గిరీశ స్వర్ణసంపూజలన్
సరిలేరెవ్వరు; కృష్ణరాయలకు అష్టైశ్వర్యభోగమ్మునన్

## శ్రీకృష్ణదేవరాయలు - ఆముక్తమాల్యదావిర్భావం"

- విశ్వనాథ సత్యనారాయణ

**మధ్యాక్కర**

శ్రీకృష్ణదేవరాయలు మహీజయసిద్ధిని బడసి
శ్రీకాకుళాంధ్ర విష్ణువును సేవింప చిత్తములోని
ఆకాంక్ష తీరగా వచ్చి యిచటకు నంబుజ నాభు
ప్రాకారమున విశ్రమింప స్వప్నమునందుఁగనబడి

**మధ్యాక్కర**

ఆసార సాక్షుఁడు భక్తుఁడౌ మహాంధ్రావని పతికి
నాసార సాహిత్య దక్షునకు నామహాకృతికర్త
కాశాసనమ్ములు వలికి తెనుఁగు రాయడ వీవుగాన
ధీసాంధ్ర నా పేర నొక్క గ్రంథము తీరుచుమనిన

**మధ్యాక్కర**

భూనాథుఁడా విషయమును నెఱిఁగింప భూసురవరులు
శ్రీనాథు దర్శనము శుభదమనియు శ్రేయస్కరమని
వేనోళ్ళఁ గొనియాడి మరియు నాగామి వివిధఫలముల
బూని వచించిరి నృపుఁడు నిశ్చయము బొనర్చెమదిని.

**మధ్యాక్కర**

భువనవిజయ మనుపేర ప్రత్యేకముగ నొక్క సభను
కవిదిగ్గజము లెనమంద్రతోడ సంకలితము జేసి
యవనీషుఁడాదరణంబు జూపెననర్ఘంబులైన
వివిధ కావ్యంబుల సృష్టికి మొదట బీజంబువేసె.

**తే.గీ.**

“ఆదినుండియు నీవు దామోదరుఁడవె
యున్న గడుసరి వ్రాత వ్రాయంగ నేర్చు
నుత్తమోత్తమ పూరుషులున్న భూమి
తెనుఁగు దేశంబు నిజముగా దేవభూమి

# ఘనకీర్తిధరుడు

రచన :

నన్నయాఖ్యుడు తిక్కనయు ఎఱ్ఱన తొలుత
ఆంధ్రభాషకమూల్య మంకురమిడ
అష్టదిక్కరులురాయలు పోతనాది ప్ర
బంధకవులు నీరుబలము నిడగ
కాటూరి జాషువా కరుణశ్రీ యాదిన
వీనకవులు మొక్క వృద్ధిజేయ
తిరుపతికవులు కొప్పరపు వారవధాన
క్రియనజేసిన కృషి క్షితిజమనగ
గరికపాటి మేడ్సాని నాగఫణిగార్ల
ధారిణీ వృక్షఫలములు ద్రాపమనకు
వ్యాప్తిజెంద, తెలుగుదీప్తి అలముకొనియె
ఖండఖండాంతరములందు ఖ్యాతిగాంచి

**ఆముక్తమాల్యద గూర్చి..**

విష్ణు చిత్తుకు విష్ణు వినిపించె కథ ఏ ప్ర
బంధమున నమోఘ ప్రతిభజూపె
హరితెల్పి సతితోడ యామునికథ ఏ ప్ర
బంధమున నమోఘ ప్రతిభజూపె
తాల్చి హరికిడు గోదాదేవి ప్రతిభజూపె
బంధమున నమోఘ ప్రతిభజూపె
మాలదాసరిగాథ మాధుర్యములు ఏ ప్ర

బంధమున నమోఘ ప్రతిభజూపె
బ్రహ్మరాక్షసు ప్రాబల్య ప్రజ్ఞ ఏప్ర
బంధమందున నద్భుత ప్రతిభజూపె
అదియె ఆముక్తమాల్యద ఆచరితము
కృష్ణరాయవిరచితమైకీర్తిగాంచె

**శ్రీకృష్ణదేవరాయలు గూర్చి**

ఉదయాద్రి స్తంభాద్రి - ఉర్లుకొండయు నుంద్రు
కొండ, కప్పల రాయి కొండవీడు
కప్పలవాయియు కనకగిరి కటక
పురిమొదలగు దుర్గములజయించి
దక్షిణాపథమునంతయునొక్కటిగనిల్పి
పాలనమొనరించె ప్రజ్ఞజూపి
సాహిత్యసంగీత సకల కళల తన
పాండిత్య ప్రతిభతో వన్నెతెచ్చి
అష్టదిగ్గజముల బ్రోచె, అట్టివారి
నెట్టులేరీతితరమెవర్ణింప వారె
సాహితీసమరాంగణ చక్రవర్తి
కృష్ణరాయవిభుడు ఘనకీర్తిధరుడు

# తెలుగువారి ఆస్తి - దివిసీమ కీర్తి

- నల్లూరు లక్ష్మీనారాయణ

*9949313342*

సీ॥ ఆంధ్రదేశము మెచ్చి ఆదివిష్ణువు, తానె
అవతరించెనిట శ్రీకాకుళంబు
ఆంధ్రవిభుని మెచ్చి యాకృష్ణరాయలన్
అడిగె కావ్యమ్ము శ్రీకాకుళాన
ఆంధ్రదేశమునకు నానాటి రాజ్యమై
అలరారె నిదియెశ్రీకాకుళంబు
అర్చకస్వామికి అండగా విష్ణుడే
కావించె నెరులు శ్రీకాకుళాన

తే॥గీ॥ గంగ తాకృష్ణయై పారు శ్రీకాకుళంబు
కాలకంఠుడె తానెశ్రీకాకుళంబు
కళల నెలవుల జాణ శ్రీకాకుళంబు
కమ్మనైనయమ్మగదశ్రీకాకుళంబు

తే॥గీ॥ కృష్ణరాయలె తెలుగుకు గేయస్ఫూర్తి
కృష్ణరాయలె తెలుగునికేతనాస్తి
కృష్ణరాయలె తెలుగుకు కీర్తిమూర్తి
కృష్ణరాయలె తెలుగులకిష్టమూర్తి

కం॥ ఆహా! ఓహో! అంచును
ఆహూతులతిథులు సభ్యులందరు మెచ్చన్
ఆహా! దివిసీమోత్సవ
మాహా!హా! భళిజరిగెను ఐక్యమనీషన్

# శ్రీకృష్ణదేవరాయ - వైజయంతిక

- డా॥ వంకాయలపాటి రామకృష్ణ
8897822469

సీ॥ సంగీత సాహిత్య సమరాన సాటిగ
కృష్ణరాయ నీకెట్టి ఎదురులేదు
ఆంధ్రభోజుడవన్న ఆనాటి మాటకు
ఆంధ్ర పథము నెట్టి మార్పులేదు
ఆంధ్ర మహావిష్ణు రాయనిను తలచి
కోరెతన చరిత కుదురుగాను
ఆముక్త మాల్యదై అలరించె లోకాన
ప్రౌఢకావ్యగరిమ పరిమళించె

ఆ॥వె॥ రంగనాథు కొలువు రమ్యమై వెలయగ
స్వామి చేరు పథము సాధ్యమయ్యె
విష్ణు చిత్తులలర విహరించె నీ వీధి
మాతృ భక్తి తోడ మమత పంచి

ఆ॥వె॥ కౌశలతను దెల్పె కౌశికధ్వజము
ఆర్తి పొందు రీతి హరిని గొల్వ
కృష్ణదేవరాయ ఎసగెనీ కుశలత
తెలుగు వెలుగు లోని దీప్తి వోలె

తే॥గీ॥ మాల దాసరి కెంతటి మహిత గలిగె
కృష్ణదేవర నీచేత కృతిన దెలిసె
మసిని దాగిన మాణిక్య నుసిని దులిపి
అంతరాలను తాకిన అజుడ నీవె

ఆ॥వె॥ ఆంధ్ర విష్ణు చెంత నవుర! బ్రహ్మోత్సవాల్
పద్య కవిత లిచట పరిఢ విల్లె
భాష సంస్కృతి నిల పాదుకొల్పు
ప్రభుత కృషిని పొగిడి ప్రణతులిడుదు.

# "దేశభాషలందు తెనుఁగు లెస్స"

- రాళ్ళబండి నాగభూషణ శాస్త్రి

ఉ॥ నన్నయ తెన్గు పద్యరచనంబునకుందలమానికంబులౌ
తెన్నుల నెల్లఁజెప్పి తొలి - దేశికుఁడై సరసార్థగౌరవో
త్పన్నముఁజేసె భారతముదాహరణంబుగఁదిక్కనాదులున్
వన్నెలు దిద్దినారు నుడి-వైభవముల్ పొలుపొందునట్లుగన్

ఉ॥ తేట తెనుంగు బాస నల - తిక్కనమక్కువ తోడఁగబ్బపుం
బాటల మేల్తరంబులుగ - వాడుక చేసి పదేను పర్వముల్
చాటెను బాటవంబనితరప్రతిభ కవికంజసూతిగా
నాటికినేటికిన్ తెనుఁగు - నాల్కలు మెచ్చులు పల్కునట్లుగన్

మ॥ ఎనలేనట్టి పద ప్రయోగములతో నింపైన యూహాబలం
బున నెఱ్ఱన్న సశేషభాగమును సంపూర్ణంబుగావించి వ్యా
సనిరుక్తమ్మును సర్వసుందరముగా సంధానమున్‌జేయగాఁ
దనరారుంగద యాంధ్రభారతము విద్యాదేవ్యంకారమై

సీ॥ సహజపాండిత్యుని - సాటిగా మధురవా
గ్ధాటికిఁ బేర్కొనఁ - గవులు కలరె?
కవిసార్వభౌము విఖ్యాత సామాసిక
విన్యాసముల ఠీవి వెలయునెచట?
అలసానిపెద్దన - యల్లికనేర్చిన
సానువులెటతార - సపదుదురిల?
ఆంధ్రభోజుని కల్ప - నాంశంబులమరిన
కావ్యంబు లెన్నెన్ని - కలవు చూడ?

తే॥గీ॥ అచ్చ తెనుఁగుల సొంపుల నద్దగలుగు
చేమకూరలు, దిమ్మనల్ చెలఁగి రెచ్చట?
సరస సంగీత సాహిత్య.. సంగమముగ
కృతులు వెలసిన వెచటయిూ పృథివిలోన?

ఉ॥ ఏనుఁదెనుంగు వల్లభుఁడ నియ్యది తెన్గుల దేశమౌటచే
నానుడి తీరు తీయముల - యందభిమానముగల్గియుండుటన్
బూనిక చేసి వ్రాయుమనెఁబొల్పు లెటింగిన వాఁడనైనన
న్నానతియిచ్చి కబ్బమును - నంబుజ నేత్రుఁడు తెన్గుబాసలో

తే॥గీ॥ దేశభాషలయందునఁ దెనుఁగులెస్స
యన్న సత్యంబుఁదొలుతవా కొన్నవాఁడు
సాహితీసమరాంగణ చక్రవర్తి
ఆంధ్రభోజుండు కృష్ణరాయావనిపతి

# శ్రీకృష్ణదేవరాయ రాజసము -
# ఆంధ్రభాషా విభవము

- శ్రిష్టి శ్రీనివాస్

కం. శ్రీకరముగ శుభకరముగ
శ్రీకాకుళమందు వెలయు శేషశయనునే
యాకులములేక నిరతము
ప్రాకటముగఁ బ్రోవుమనుచు ప్రార్థింతునెదన్

తే.గీ. మూరురాయర గండని పౌరుషరస
తృష్ణసాహితీ సమరాన తేజరిల్ల
రాజ సభయెల్ల యగణిత రాజమయ్యె
రమ్య సాహిత్య భావనా రాజ్యమయ్యె

ఆ.వె. రాజసాన నిలిచి రాణకెక్కుటె కాదు
రాజులందు మేటి రాజు తాను
తుళువ వంశ దీప్తి తళుకు లీనెడు రీతి
సార్వభౌముడయ్యె సర్వభృతకు

ఆ.వె. శస్త్ర విద్యలెల్ల స్వాధీనమైయుండ
సాటి యెవ్వరయ్య సమరశీల
సకల రాజచయము సామంతులై కొల్వ
కృష్ణదేవరాయ కీర్తికాయ

ఆ.వె. విష్ణు చిత్తమెరుగు కృష్ణరాయ కృతులు
దండడించ భక్తి నందనముగ

ఆంధ్రదేవు కరుణ నాముక్త మాల్యద
నందగించినాడు విందు చేసి

ఆ.వె. భువన విజయ గాధ దివిదాక వినిపించ
సభల తీర్చినట్టి చక్రవర్తి
కపన కాంతిరేఖ గగనాని కెగబాక
తనకు తానెసాటి తెనుగు వాటి

ఆ.వె. నవ్య కావ్యలతలు నల్లేటి నడకల
దిశల విస్తరించు దశను చూపి
తెలుగు వల్లభుండు వెలుగు రాయండిల
ఇక్షు కావ్యరుచుల ఇచ్ఛఁ దీర్చె

తే.గీ. తాను ధరియించి యిచ్చిన దండఁదీసి
ఇష్ట దైవాల సేవకు నిచ్చినట్లు
కృష్ణరాయ క్షితీంద్రుని కృతుల దండ
కంఠహారమయ్యెను నాంధ్రి గళమునందు

సీసము పొట్నూరి స్తంభాన పొటమరించిన దీప్తి
భువన విజయ జయ భూషకాగ
అనవద్య విద్యతో అవధాన ప్రజ్ఞతో
కవితావతంసులు కదను తొక్క
ప్రకృష్టబంధాల వాసించు గ్రంథాలు
వాణీ విహారాల తాణ కాగ
వాదనా వైభవ పాండితీ ప్రతిభలు
సాహితీ గోష్ఠుల శాద్వలముగ

ఆ.వె. వీనికెల్ల మేలు దేని వల్ల కలిగె?
దక్షత గల రాజు దార్శనికత,
చవులు గుబులు కొనెడి సరిలేని అందాల

తెలుగు నుడుల నడల తీపి కలన

ఆ.వె. అట్టి తెలుగు భాష, యాంధ్రభాషా యోష
పరిమళించు పూల సిరుల సేస
హరిత కాంతి దీప్త పరిధాన పరివేష
భవ్య నవ్యభావ భాగ్య భాష

# నవరసాల వెలుగు మన తెలుగు

- దుబ్బల దాసు

తే॥గీ॥ క్షరము గాని దివ్య వరమైన అక్షరం
పదపు పిలుపు కొరకు పలుకు కొరకు
భాషలోని మధుర భావాల పులకించ
తొలకరించు మనసు పులకరించు.

తే॥గీ॥ తెనుగు భాషాక్షరాలలో తియ్యదనము
మాతృమూర్తి కుడిపిన మధురసాలు
తెలుగు భాషకు తీరైన వెలుగులన్ని
పదపదాన భావక్షర పలుకుబడులు.

సీ॥ త్యాగయ్య గళములో తారాడు శబ్దాలు
సంగీత సౌందర్య సప్తనిధులు.
క్షేత్రయ్య పదములో క్షేత్రాల నాదాలు
భక్తి కందిన దివ్య భావపదము.
అన్నమయ్యపదము అలరించి మేల్కొల్పె
దైవ శిలలు దాకి ధరణిమెచ్చ.
రామదాసుని పద రమనీయ రాగాలు
రామనిందలయందు రక్తిముక్తి

తే॥గీ॥ అక్షరమునకు సొగసైన శిక్షనొసగి
భావ పరిపుష్టినందించి సేవజేసి
స్వర శుభాక్షరి సంగీత జలకమాడి
కీర్తి శేషులైనారు సంకీర్తనందు.

ఆ॥వె॥ తెలుగు నేలనాది తెలుగు భాషయె నాది
తెలుగు సాంప్రదాయ తీరునాది
తెలుగు వెలుగులన్ని తెలుగాంధ్ర జాతికై
తెలుగు నిలుపవయ్య తెలుగువాఁడ.

తే॥గీ॥ సాంప్ర దాయత కున్నట్టి చక్కదనము
పదపు పొందిక రుచులకు వందనాలు
కృష్ణరాయలు మెచ్చిన కృతుల తెలుగు
పద్యమై నిల్చె గనుమిందు పరవసించి.

ఆ॥వె॥ ఎంత కాలమిటుల ఏరీతి మార్పును
చూడ గలమొ యెపుడు పాడగలమొ
పలుకు లందు మిగుల పరవారి ముచ్చట్లు
మరువ వీలుగాని మమతలందు.

గీ॥మా ఊరు మాచర్ల వినుకొండ ఉనికినాది
గురువు జాషువ వరమైన తరువతందు.
అక్షరాలతో నాయింట శిక్షనొసగి
పద్య మల్లించు మగ్గమై ప్రతులుదీయ
అదియె వరమైన వివరము అక్షరాల

# శ్రీకృష్ణదేవరాయలు

- డా॥ నూనె అంకమ్మరావు

సీ॥ ఆంధ్ర మహావిష్ణుదానతి నందించె
నాముక్తమాల్యద నమృతఫలము
భాషణా చతురుండు పాలనాదక్షుడై
సమరరంగము నందు సఫలుడయ్యె
భక్తి సంకీర్తనా పరుడుగా మాలదా
సరికథ నిట్లు తాసంస్కరించె
సాహితీ సామ్రాజ్య చక్రవర్తిగ వెల్గి
నాంధ్రభోజునిగ తానాఖ్యబడసె
విజయపతాకము వినువీధులందున
రెపరెపలాడించి రేడు వరలె

తే॥ రాయదేవేంద్ర! నీ కళా రాజ్యలక్ష్మి
ఘన యశోవైభవమున ప్రఖ్యాతినొంది
మంత్రి ధీయుక్తి నీ శక్తి మహిని వెలిగి
భువన బాండమ్ము సత్కీర్తి బొందినావు

సీ॥ అష్టదిగ్గజ కవులాస్థానమున నొప్ప
భువన విజయమంచు పొగడ బడియె
జనుల మెచ్చునటుల మనుచరిత్రను జెప్పి
అందలమెక్కెను అల్లసాని
పారిజాతకథను పరిమళంబుగ జెప్పి
ముక్కు తిమ్మనకవి మురిసిపోయె

పాండురంగ చరిత పావనంబుగ జెప్పి
వికటకవిగ తాను విజయుడాయె
భట్టుమూర్తియు రామభద్రుండు పింగళి
సూరన్న మల్లన్న సుకవి వరులు

తే॥ ధూర్జటి మహిమ జెప్పెను ధూర్జటి కవి
ఇమ్మహీతలమందున యెంచి చూడ
అష్టదిగ్గజ కవులెల్ల యలఘు యశులు
నవ్య కల్పనా చాతుర్య భవ్యగుణులు

తే॥ తెలుగు సాహిత్య లోకాన వెలుగు రీతి
రచనలెన్నియో గావించి రాణకెక్కి
సరస సాహితీ సమరాంగణ సార్వభౌము
డంచు ఘనకీర్తి గడియించె నవనిలోన

తే॥ రాజ్యపాలన యందు నీ రాజసంబు
దేశభక్తి యందున నీదు దెగువతనము
కవుల నాదరించిన నీదు కరుణ గుణము
చెక్కు చెదరదు వర్ణించి చెప్పతరమె!

# ఆంధ్రభోజునకు పద్య నీరాజనమాలిక

- ఆలూరు శిరోమణిశర్మ

అష్టపద సీసమాలిక :

శ్రీకాకుళంబున శ్రీకారమును జుట్టె - ఆంధ్రమహావిష్ణునాజ్ఞజేసి
ఆంధ్రభాషాయోష నాదరింపనుబూని - వివిధ భాషల ఘనవిజ్ఞుడౌచు
"దేశ భాషలయందు తెలుగు లెస్స"ంచును - చాటించుటలొ తాను మేటియయ్యె
అష్టదిక్కరులంచు నష్టకవీంద్రుల - సుష్టుగ పోషించి తుష్టిగూర్చి
బహుప్రబంధంబుల వ్రాయించి రక్షించి - భువన విజయమును పూన్చి నెఱపి
అగణిరత్నమౌ "ఆముక్త మాల్యదన్" - ద్విగుణిత పాండితి తీర్చిదిద్ది
విష్ణుచిత్తుని భక్తి విభవంబునకు మెచ్చి - తన్వి గోదాదేవి తండ్రిజేసి
వీరశైవంబును పారద్రోలుటకంచు - యాముని వైష్ణవు నర్ధినిల్పి

తే॥గీ॥ సమర సాహిత్యరంగంపు సార్వభౌమ!
ఆంధ్రభోజా! సుపాలకా! సాంద్రకీర్తి!
విజయ నగరాధిరాజ! శ్రీకృష్ణదేవ
రాయ! ఆంధ్రాభిమాన! మాప్రాంజలులివె!

తెలుగువెలుగు

ఉ॥ అమ్మల యుగ్గుబాల మనమందరమందిన యట్టిభాష తో
యమ్ముల మాడ్కి గల్గలల యావదమోఘతనొప్పుభాష ని
క్కమ్ముగ దేశభాషల సుఖంబుగ నెక్కుడు బల్కు భాష మా
యమ్మది యైనభాష తెలుగమ్మది యిచ్చిన తేనెభాషయౌ

ఉ॥ వేదయుగమ్మునుండి మన విత్తము దెల్పుచు శాసనంబులన్
పాదిడి నన్నెచోడ విభు పాణిని నిల్చి యవక్ర కావ్య సం

పాదన గూర్చి నన్నయ సుపండితు గంటమునంటి యాదికా
వ్యాదర మందదే! మనపురామృత భాష తెలుంగు ధారుణిన్

ఉ॥ తల్లికి సాటిలేదు మరి తల్లిదుభాషకు దీటులేదు యు
త్ఫుల్ల విశాల మానసము పూర్ణముగా తెలుగమ్మ నిక్కయై
ఎల్లలు లేని యాంధ్రమున నింపగు తేనియ తెల్గుతల్లికిన్
హల్లకమల్లె మొల్ల సుమహారములివ్వరె! సంతసమ్మునన్

అమ్మభాష

పల్లవి: ఆప్యాయతనించునదీ అమ్మభాష – అమృతమును పంచునదీ అమ్మభాష
అమ్మభాష కమ్మదనము నాదిదేవుడైనా –
వమ్ముచేసికోడమ్మ నమ్ము తెలుగుకొమ్మా ॥అ॥

చ॥ ప్రేమమైన అమ్మ ఒడి – అక్షరాల తొలి బడి –
ఉగ్గుబాల రంగరించి త్రాపు అమ్మనీకది
తల్లి ఒడిని నేర్చుభాష తరతరాలు ఖ్యాతినిల్పు –
ఉల్లము రంజిలమనకూ ఉత్సాహము పాదుగొల్పు ॥అ॥

చ॥ అమ్మపదము కమ్మదనము –
నాన్నపదము మధురము –
అది తెలియకమనమిప్పుడు ఆంగ్ల పదములొదలము
తెలుసుకోర బుజ్జినాన్న తెలుగుభాష గొప్పదనము –
మలచుకొనీ అలవాటును మాతృభాష మాట్లాడుము

చ॥ ప్రతినచేయు ఆంధ్రభోజు (విష్ణు) సాక్షిగాను నేటి నుండి
ప్రతి మాటను తెలుగుమాట పల్కెదనని నోటినుండి
ప్రతి ఇంటను తెలుగుభాష పరిమళాలు వెదజల్లీ –
ప్రతి గుమ్మము తెలుగు సంస్కృతిని నిల్పు తెలుగుచెల్లి ॥అ॥

"దేశభాషలందు తెలుగు లెస్స"
"మా తెలుగు తల్లికి మల్లెపూదండ"

## తెలుగుభాష వెలుగు

- విలాస్ జంగాల

*8374254114*

తే॥గీ॥ అమ్మతననోట పలికించె నచ్చతెలుగు
ఆమె నేర్పిన పలుకులే యమృతవాక్కు.
మధుర భావాల కదినేడు మాతృకయ్యె
మనసు కదిలించు తనదైన మమతవరము.

తే॥గీ॥ తియ్యతేనియ మధురిమ తెలుగుభాష
ధీరవరులకు దీటైన తెలుగుభాష
దేవ భాషకు సరితూగు దివ్యభాష
పరమ నిష్ఠాగరిష్ఠమై పల్లవించు.

సీ॥ తెనుగింట వాగ్దేవి తేజమైరాజిల్లు
కావ్య సంపదలందు కదలిసాగు.
పద్యమై గద్యమై పండిత నేస్తమై
ఛందనాలందమై చక్కనమ్మ.
పామర జనరక్తి పరిపుష్ట సాంద్రమై
విఖ్యాతి గాంచిన వేల్పుతెలుగు.
సాహితి పూదోట సంకీర్తనాఝురి
రమ్యమై రవళించు రసమయూరి.

తే॥గీ॥ తెలుగు వెలలేని మూలమై దివిననిలెచె
పూర్వ మాన్యుల కవనాల పుటమువేసి
శారదాంబను మురిపించు సత్యసంధ్య
అదియె తెలుగింటి వరమైన యాంధ్రభాష.

సీ॥ సాహితీ సామ్రాజ్య సౌధములైనిల్చి
సాంప్రదాయ కవుల స్వాగతించు.
కవనపుదోటలో కమ్మనిబంధాలు
పెనవేసి విడిపోని పెన్నిదాయె.
చేరగ రావమ్మ శిరమెత్తి నిల్చెద
చిక్కని భావాల సిరులుగురువ.
తలపు టుయ్యలలూపు తలపు నివ్వగరావె
మదిన గొలుతునిన్ను మరువనెపుడు.

తే॥గీ॥ కలము పట్టితి కాంచుము కరుణజూపి
అక్షరాలను మదినుండి ఆలపించ.
వెన్ను దట్టము పద్యాల తెన్నుజూపి
నిలిచి పోవమ్మ వాగ్దేవి నిన్నుమరువ.

# తెలుగు వెలుగులు

- వేమకోటి శాంతారావు

*9849383564*

సీ॥మా॥ శాతవాహనహాల జనపదగాదల
సప్తశతుల దోచు ఛాయవౌచు
ద్రవిడ పుత్రిక వౌచు తమిళకన్నడమళ
యాళసోదరులతోనాడుకొనుచు
తల్లిగీర్వాణికి దత్తపుత్రికవౌచు
ప్రౌఢాంధ్రకన్యవై పరిఢవిలుచు
సంస్కృతపాకృత శాసనమ్ముల మధ్య
'నాగబు' పదముద్రనవతరించి
తెలుగుశాసనముల జిలిబిలిపలుకుల
పలుకుకొనుచు పాట పాడుకొనుచు
రాజరాజనరేంద్రు రమణీయ సంస్థాన
కర్పూరతాంబూల ఘనత గనుచు
దేశకవిత వేది ద్విపద నర్తనజూపి
అచ్చాంధ్ర రీతుల నలదుకొనుచు
నెల్లూరు అద్దంకి నెఱిరాచవీధుల
'భారతకథ' సుధా ప్రచురవగుచు
కొండవీటీ దుర్గ కుడ్యమ్ములకు ప్రాకి
కవిసార్వభౌమత్వం ఘనత గనుచు
విద్యానగరరాజ్య విభవాల చవిజూచి

పల్లికినూరేగు పడుచువౌచు
వెలమరాజ్య ప్రభా విజయ ఘంటికమ్రోగ
సర్వజ్ఞ పంటలు నిలుపుకొనుచు
దక్షిణాపథమున తంజవూర్మధురల
నాయకరాజుల నాయికగుచు
మల్కిభరాముని మమతానురాగాన
తెలగాన రాజ్యాన తిరుగుకొనుచు
క్షుద్రశృంగారాలు శ్రుతిమీరి మతిమారు
కవికుమారులనెల్ల కసరుకొనుచు
నవ్యకవనసీమ నవవసంతాగమ
ప్రేమగీతికపాడు పికమువగుచు
అభ్యుదయోద్యమమ్ముల విప్లవోద్యమ
స్థాయిపెంచు జయ పతాకవగుచు
వాగ్గేయ సాహిత్య వైభవోన్నతరాగ
మాధుర్యభక్తితో మరులనిడుచు

తే॥గీ॥ పదముపాటయు పద్యద్విపదములగుచు
సరస సంకీర్తనా వచనగరిమవగుచు
నవలనాటక కధ మినీ నానివగుచు
వ్యాసజీవన చరితల వ్యాప్తమగుచు
పలువిధమ్ముల విశ్వరూపమ్ముజూపు
తెలుగుతల్లికి వందనములను జేతు॥

ఆ॥వె॥ చల్లనైనమాట చక్కదనపుపాట
పద్యమైనలేక గద్యమైన
చక్కనొదిగిపోవు సారస్వతీభూష
మా తెనుంగుభాష మంజువేష

# తియ్యనైన తెలుగు భాష

- బిరుదవోలు రామిరెడ్డి

*9441108229*

సీ. సన్నుతికెక్కిన నన్నయవృత్తముల్
తిక్కన భారతి తియ్యదనము
శృంగారమొలికెడి శ్రీనాథుకావ్యాలు
భక్తిరసామృత భాగవతము
కంచెర్ల గోపన్న, కాకర్ల త్యాగయ్య
కమ్మని సంగీత కైతలహరి
ఎఱ్ఱన వర్ణన - ఎల్లన్న రసపుష్టి
అన్నమాచార్యుని విన్నపాలు
బ్రౌనుదొరగారి సేవలో పరిఢవిల్లి
మధురమంజుల మోహన సుధలదేలి
విశ్వవీథుల నెగబ్రాకి శాశ్వతముగ
దేశనాణెములపయిన తేజరిల్లె

తే. ఎన్నొ అవధానప్రక్రియల్ ఉన్నభాష
శ్వేతప్రభువులు మెచ్చిన శిష్టభాష
తూర్పుదేశాల రాజ్ఞియౌ దొడ్డభాష
దేశభాషలలెస్సన్న తెలుగుభాష

తే. తెలుగు భాషాభివృద్ధి నీధ్యేయమయ్య,
మాతృభాషోద్యమమునకు మద్దతిచ్చి
జవబలములు చేకూర్చి ప్రోత్సాహమీయ
కదలిరావోయి సిద్ధమై 'కవికుమార'!

తే. తల్లి భాషకు దుర్దశదాపురించె
తరలిరండు కనీసకర్తవ్యమనుచు
కమ్మని తెలుగుమృతభాషకాకమునుపె,
కదలిరండు 'భాషోద్యమకారులార'!
సమయమాసన్నమయ్యె నీక్షణమునందె.

తే. అమ్మనాన్నలనెడి కమ్మని పిలుపులు
అంతరించుచుండె నందరిండ్ల
మమ్మిడాడిలనెడి మాటలే ముద్దాయె
దీనదశకుజేరె తెలుగుభాష!

ఆ. జన్మతోడ మనకు సంక్రమించినయట్టి
మాతృభాష తెలుగు మరచిపోయి
ఆంగ్లభాషనేర్చి ఆంధ్రంబురాదంచు
చెప్పుకొనకుమయ్య సిగ్గుచేటు.

తే. ఆంధ్రకావ్యంబులన్నియు అరలలోన
చెదపురుగులకాహారమై ప్రిదులుచుండె,
తెలుగుభాషాభివృద్ధికై దీక్షబూని
కార్యసాధనకిక నైన కదలుడయ్య.

సీ. మన సంస్కృతివిభవమును విశ్వమున చాటు
మంత్రౌషధము మన మాతృభాష
మనిషికి సంపూర్ణమానవత్వము నిచ్చి
మర్యాద హెచ్చించు మాతృభాష
అన్యభాషలనెల్ల అవగాహనమొనర్చి
మనసుపటిమబెంచు మాతృభాష
మేధస్సు వికసించు మెలకువలను నేర్పి
మమత సమతదెల్పు మాతృభాష.

సీ. "కార్యాలయము పేరు కమ్మని తెలుగులో
తప్పక వ్రాయు ఉత్తరువులిచ్చి
పాలనాపరమైన పత్రాలు మాతృభా
షను వివరించెడి షరతువెట్టి
అధికార్లకర్పించు అభ్యర్థనము లాంధ్ర
మునను్న అధిక ప్రాముఖ్యమిచ్చి
ఆంధ్రమాధ్యమవిద్యనభ్యసించెడివారి
కార్థిక సాయమ్మునందజేసి

తే. మొదటి ఐదుతరగతుల చదువులన్ని
తెలుగుమాధ్యమమందుండి తీరునట్లు
కఠినసూచనల నొసంగి పటిమతోడ
అమలుపరచిన మాతృభాషాభివృద్ధి
'మూడుపూలారుకాయలై' మునుపటివలె
దినదినప్రవర్ధమానమై తెలుగుభాష
దేశభాషలలెస్సయై తేజరిల్లు"
అనుచు నాఆశయము దెల్పితనఘులార!
సభకు విచ్చేసియున్నట్టి సభ్యులార!
మానధనులార! లలిత విజ్ఞానులార!
ప్రముఖకవులార! పండితప్రవరులార!
స్వీకరింతురొ, లేదొ, నా విన్నపంబు

## పద్యశోభ

సీ. కనలేదు చైతన్య కావ్యస్రవంతిగా
వింటిని భాషను విశ్వమునకు
కనలేదు సాహిత్య కమనీయ తనునేను
వింటిని కవిలోక వీరుడవని।
కనలేదు సుకవుల కలిపిచేసినసభ
వింటిని సాహిత్య విద్య పటిమ।
కనలేదు దేవనీ కలరచనపదును
వింటిని దిగ్గజ విజయచరిత।

తే॥ కృష్ణ దేవ రాయ లిక్కడే కూర్చుండి
తాటి యాకు మీద తాను వ్రాసె
కంటి నేడు పద్యకవివర రాజన్య!
వింటి పద్య శోభ మింటి నంట।

## తెలుగు పద్యం

సీ॥ కోయిల గుంపులు కుహుకుహూ నాదములో
చెవుల కింపుగొల్పగ జేసినట్లు,
చిలుకపల్కులవి సుశ్రీలు వెలయగా,
పలుమారు మధురమై పలుకునట్లు
మధురమనోజ్ఞమై మంజులార్భటులతో
మోరబంభరములు మ్రో'యునట్లు',
జిలిబిలిపల్కుల బిలబిల గువ్వలు
అలరంగ గుసగుసలాడినట్లు
ఆ॥వె॥ సురుచిరమ్ము బహుళ సుందరము తెలుగు
శ్రుతిహితమ్ము చేయ సుభగమగును;
అహరహమ్ము మనకు అందమానందము,
హృద్యమగును తెలుగుపద్యమరయ! 6

ఆ॥వె॥ సూర్యునట్లు కాంతి శోభావహమగుచు,
చంద్రునట్లు చల్లు చల్లదనము
తెలుగు వెలుగువలయు దేశవిదేశాల !
అన్ని భాషలకు మిన్న భాష ! 7

ఆ॥వె॥ తెలుగు వాడనాది, తెలుగుజాతి యశస్సు
తెలుగు భాష పలుకు తియ్యదనము;
శాశ్వతము కాగ శత సహస్రము వెల్గు
సారసార్ద్ర మొసగు సంతసమ్ము ! 8

## శ్రీకాకుళాంధ్రదేవ

ఏ స్వామి కరుణార్ద్ర దృష్టి మహిమచేత
పాడిపంటలు సదా పరిఢవిల్లు,
ఏ స్వామి కరుణార్ద్ర దృష్టి మహిమచేత
దానధర్మమ్ములు ధాత్రి వెలయు
ఏ స్వామి కరుణార్ద్ర దృష్టి మహిమచేత
ప్రేమ సౌహార్ద్రముల్ వెల్లి విరియు,
ఏ స్వామి కరుణార్ద్ర దృష్టి మహిమచేత
శ్రీకాకుళమున సుశ్రీలు చిందు,

అఖిల శుభములు శాంతిసౌఖ్యమ్ములిచ్చి,
ఆయురారోగ్య భాగ్యాలు అమరజేసి,
కంటికిన్ రెప్పయై సదా కావు మయ్య
అఖిల జననుతా! శ్రీకాకుళాంధ్ర దేవ!!

## ఆంధ్ర వీరమాత

కలము ఖడ్గము బట్టి కవనమ్ము కదనమ్ము
సలుపు తిక్కన్న మా తెలుగువాడు,
ప్రాజ్య సామ్రాజ్య సౌభాగ్య కేతన మెత్తు
దేవరాయలును మా తెలుగువాడు,
ప్రీతిమై జగతి సంగీత భిక్షను పెట్టు
ఘనుడు త్యాగయ్య మా తెనుగువాడు,

పూర్వ వైభవగీతి నపూర్వఫణతి
స్వేచ్ఛగా స్వచ్ఛముగ నాలపించుచుండు
ధన్యులాంధ్రులు ప్రియ సహోదరులు నాకు
విశ్వవిఖ్యాత మా 'ఆంధ్ర వీరమాత'!!

## ఆంధ్రపుత్రకుడనేను

కల్యాణ లావణ్య కమనీయ కాంతులు
చిమ్మె విశ్వాన మా శిల్ప లక్ష్మి,
కళకళలాడు క్రౌంచదళుకులం గుల్కెడు
సౌభాగ్యరేఖ మా జయపతాక,
ఖండఖండాల ప్రఖ్యాతి నార్జించె వి
నిర్మలంబైన మాధర్మ దీక్ష;
సకల సస్యములతో సంపదల్ సమకూర్చె
భవ్యమైనట్టి మా భాగ్యలక్ష్మి;
తెలుగువెలుగులు దశదిశల్ తేజరిల్ల
వేయి జన్మాల కాంధ్రత్వమీయుమనుచు
పుణ్యమాతను పూలతో పూజసేయు
ధన్యజీవిని! ఆంధ్ర పుత్రకుడనేను!!

మహిత మహిమాభిరామ మా మాతృసీమ,
మధు సుధాభావ మంజూష మాతృభాష,
మణి గణమ్ముల దీవి మా మాతృదేవి,
ధన్యజీవిని ! ఆంధ్రపుత్రకుడనేను!!

**ooo**

అష్టోత్తర శతదేవళములు నొకటియై
        గ్రాలు స్థలమ్ము శ్రీకాకుళమ్ము
కాసుల పురుషోత్తమ కవితా కన్యకా
        నిలయమై పావన స్థలమునయ్యె
ఆంధ్ర మహావిష్ణువన్న ముదమ్మున
        పాటలాటలు ముద్దుపళని సలిపె
శ్రీకృష్ణరాయల కృతిని 'శ్రీకాకుళం'
        విమల యశమునందె విశ్వమంత

పద్యకవితల బ్రహ్మోత్సవములకెల్ల
సిరికి కొలనునెలవగుట సిరిని పొందు
జయము జయము మన ప్రభుత్వ సంయమముకు
జయము జయము మన తెలుగుజాతికెపుడు

**ooo**

- తుంగల మాధవీ ప్రియ

అమ్మ అన్న పిలుపు ఆనందమనిపించు
అమ్మ పిలుపు మనకు అమృతంబు
అమ్మనెపుడు నీవు ఆనందపరచుము
అమ్మకన్న మిన్న అవని లేదు ॥ఆటవెలది॥

**ooo**

- కారంకి లక్ష్మీభవాని

అడగకుండ మనకు ఆవుపాలను ఇచ్చు
నదులు నీరునిచ్చు నయముగాను
పరులకుపకరించు బ్రతుకు ధన్యంబు
ప్రకృతి చూచినీవు బ్రతుకవలయు

తెలుగు పద్యకవితా బ్రహ్మోత్సవములు-2017

# శ్రీకాకుళ పద్యభారతి



కాసుల పురుషోత్తమ కవి



ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి

ప్రచురణ




194

